

Chandamama, April '51

Photo by N. Ramakrishna

పూ జా రి

# చందమామ

ఈ సంచికలో యివి
చదువుకోండి


| విషయము | | పేజి |
|---|---|---|
| మంచి బాలుడు | ... | 10 |
| శతపత్రసుందరి | ... | 12 |
| విచిత్ర కవలలు | ... | 17 |
| పుష్పగిరి | ... | 24 |
| చినలక్కయ్య | ... | 29 |
| శ్రీరామదర్శనం | ... | 33 |
| లోకోపకారి | ... | 41 |
| క్రమబోధ | ... | 45 |
| ఎందుకో తెలుసా ? | ... | 49 |
| ఇంద్రజాలం | ... | 52 |


ఇవన్నీగాక పజిలు, పాటలు,
యుక్తి లెక్కలు, ముగ్గులు,
ఇంకా, ఇంకా ఎన్నో వున్నై


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు . 1686
మద్రాసు . 1.

రాధాక్రిష్ణా రిలీజ్
రాజమండ్రి.

ఆంధ్ర ప్రేక్షకులకు
ఉగాది కానుక

దర్శకుడు
బి.వి.రామానందం
సహాయదర్శకుడు
ఎర్రా అప్పారావు.బి.ఏ.



రవీపిక్చర్సువారి

# పెంకిపిల్ల (తెలుగు)

ఆంధ్ర:
రాధాకృష్ణా ఫిలిమ్స్,
రాజమండ్రి.

చిత్తూరు, రాయలసీమలకు:
నేతాజి ఫిలిమ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ,
ధర్మవరం.

ఇతర వివరములకు: రవి పిక్చర్స్, రాజరత్న బిల్డింగ్స్, రాజమండ్రి


ఏప్రిల్
విడుదల!
శ్రీ రాజరాజేశ్వరీ
ఫిలిం కంపెనీ వారి
సౌదామిని
కన్నాంబ... రజని... యస్. వరలక్ష్మి
సి. యస్. ఆర్... నాగేశ్వరరావు.. రేలంగి
ఎ. వి. సుబ్బారావు.. సూరిబాబు.. కనకం
డైరెక్టర్
కె. బి. నాగభూషణం




పిల్లల అస్వస్థతలకు

జె. & జె. డిక్షేన్,

రెసిడెన్సీ రోడ్,

హైదరాబాద్, (దక్కన్)

★







మిత్ర ఫార్మసీ - తెనాలి



ఇప్పుడు దొరుకుచున్నది

అమెరికన్ మోడల్

రోల్ ఫిలిమ్ బాక్సు

కెమెరా

గొప్ప పవర్ లెన్సుల తోను వ్యూఫైన్డర్‌తోనూ అమర్చబడిన అత్యుత్తమమైన ఈ కెమెరా చాల చౌక. ప్రారంభకులుకూడ చక్కగ ఉపయోగించవచ్చు. నం. 120 రు ఫిలిమ్ పైన $2\frac{1}{4}'' \times 3\frac{1}{4}''$ సైజులో అద్భుతముగా ఫోటోలు ఎత్తును. ఫోటోలు తీయు విధానంతో సహా వెల రు. 10-8-0. ప్యాకింగ్, పోస్టేజి లకు రు. 1-8-0 అదనం. కెమెరాకు సరిపడు లెదర్‌కేస్, రు. 3-0-0. సరుకు కొద్దిగ ఉన్నది. నేడే ఆర్డరివ్వండి. ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే జరుపండి.

**BENGAL CAMERA HOUSE (108 C. M)**

**P. O. 21. ALIGARH, U. P.**

## రు. 500 బహుమానము

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

**ఉమా మహల్ :: మచిలీపట్నము**

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.

అసలు బంగారు రేకు లోహముపైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని రుజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు రన్నె 10 సంవత్సరములు గ్యారంటీ.

* * *

పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహాద్రావకములో వేసిన 5 నిమిషములకే బంగారము రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు ఇచ్చియున్నారు. 800 డిజయినులు గల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.

*N.B.*—వస్తువుల వి. పి. పార్సిలు చార్జి 0 15 0 మాత్రమే అగును

Tel : "UMA" MASULIPATAM

---

సోలార్ పెన్స్

ఎల్లప్పుడు "సోలార్" గుర్తుంచుకొండి

శాస్త్రి పెన్ వర్క్సు తెనాలి

---

నేషనల్ వారి

ఇన్డిపెన్డెన్సు

టాల్కం పౌడర్

National

THE NATIONAL TRADING CO

ఉగాది విడుదల!

సారథీ వారి...



# అగ్నిపరీక్ష

ప్రొడ్యూసర్ కె. భాస్కరరావు
డైరెక్టర్ మాణిక్యం

రాజ్యం... రఘురామయ్య... శివరావు...
సి. యస్. ఆర్.. లక్ష్మీకాంతం.. మాలతి.. నటించిరి,

ఆంధ్రా : ప్రీమియర్ ఫిలిమ్సు లి., విజయవాడ | సీడెడ్ : సరస్వతి టాకీస్ లిమిటెడ్, గుంతకల్
నైజాం : ప్రీమియర్ పిక్చర్సు, సికింద్రాబాద్ | మైసూర్ : విజయలక్ష్మి & కంపెని, బెంగుళూరు

వివరములకు : సారథీ ఫిలిమ్సు లిమిటెడ్, మద్రాస్ - 17

వస్తూంది!

అలవిమాలిన పంతాలు
అలవోకగా నెగ్గించిన
ఐదువరాలి జాణతనం!



వినోదా వారి

# స్త్రీ సాహసము

అంజలీదేవి..నాగేశ్వరరావు...సూర్యప్రభ...సి.యస్.ఆర్.
శివరావు...రేలంగి...గిరిజ...సి.వరలక్ష్మి...రామ్మూర్తి...శీతారామ్
సదాశివరావు...అన్నపూర్ణ...విజయలక్ష్మి నటించినవి...

దర్శకత్వము...
వేదాంతం రాఘవయ్య
రచన, పర్యవేక్షణ... సముద్రాల...

సంగీతం
సుబ్బరామన్

ఛాయాగ్రహణం
రంగా

కళ
వాలి & గోడగాంకర్

MATA



ఆంధ్ర, సీడెడ్, నైజాం : పూర్ణా రిలీజు | మైసూర్ : అమృత పిక్చర్స్

# అట్టమీది బొమ్మ

విదర్భదేశాన్ని పాలించే భీష్మకమహారాజు కూతురు రుక్మిణి. రుక్మిణిని శిశుపాలునికిచ్చి చేదామని ఆమె అన్న రుక్మి వుద్దేశం. శ్రీకృష్ణుని పెళ్లాడాలని రుక్మిణి ఆరాటం. రాజధానీ నగరమైన కుండినపురంలో పెళ్లి యేర్పాటులు చకచక సాగిపోతున్నై. మరి రుక్మిణి కోరిక నెరవేరేదెట్లా? రుక్మిణి చాలా తెలివైన పిల్ల కావటంచేత అగ్నిద్యోతనుడనే బ్రాహ్మడ్ని రహస్యంగా పిలిచి 'విప్రోత్తమా!—మీవలన నాకొక మహోపకారం జరగాలి. అదేమిటీ అంటే: ద్వారకలో ఉండే శ్రీకృష్ణునివద్దకు వెళ్లి నిన్నే పతిగా నిశ్చయించుకొనివున్న ఫలానా రుక్మిణి పంపించిందని నచ్చేవిధంగా చెప్పు. నా అన్న రుక్మి తలపెట్టిన వ్యూహం వెల్లడించు. ఒకవేళ శిశుపాలుడు ఎదురుతిరిగితే అతనితో యుద్ధం చేయటానికికూడా సిద్ధంలో ఉండాలను. ఇంతకూ నన్ను కలుసుకోవడమెట్లా అని శ్రీకృష్ణునికి సంశయం కలగవచ్చు. అదీ చెబుతా: పెళ్లికి తొలినాడు గౌరీ పూజకని ఊరిబయటి గుడిలోకివస్తాననీ, ఆ సమయంచూచి నన్ను ఎత్తుకపోయి రాక్షసవిధానాన వివాహమాడవలిసిందనీ ఉపాయం చెప్పు' అంటూ రాయబారం పంపింది. ఇక్కడ రుక్మిణి ఎలా ఆరాటపడుతున్నదో అలానే ద్వారకలో శ్రీకృష్ణుడు రుక్మిణినే పెళ్లాడాలని నిశ్చయించుకుని, ఎలా సాధ్యపడుతుందా అని తహతహపడుతున్నాడు. అందుచేత అగ్నిద్యోతనుడు వెళ్లి కబురు చెప్పగానే శ్రీకృష్ణుడు అనందభరితుడై బ్రాహ్మణ్ణి అనేకవిధాల సత్కరించాడు. ఆయన చెప్పినప్రకారం సైన్యం సిద్ధం చేశాడు. బ్రాహ్మణ్ణి తన రథంమిద తీసుకవచ్చి, కుండిన పొలిమేరలో వదిలేశాడు. ఈ రహస్య రాయబారం పంపినప్పటినించీ రుక్మిణి మనసులో ఎన్నో భావాలు పరుగిడజొచ్చినై. తననుగురించి కృష్ణుడు ఏమనుకుంటున్నాడో, ఏమి జరగబోతుందోననే వేదనకు అంతులేకపోయింది. ఇటువంటి సమయంలో ఆమెఎడమకన్ను అదరటంవల్ల శుభమే జరుగుతుందని రుక్మిణి ధైర్యపడింది. అంతలోనే తిరిగి వచ్చిన అగ్నిద్యోతనుని ముఖం చూడ కలకల్లాడుతూవుంది. దీన్నిబట్టే తన పని సానుకూలమైనట్టు ఆమె గ్రహించింది. బ్రాహ్మణుడు కృష్ణుని రాకనుగురించి నోటారా చెప్పేసరికి ఆమె అనందానికి మేర లేకపోయింది. ఈ సంతోషంతో రుక్మిణి సుముహూర్తమందే గుడికి పోయి, పూజలు పూర్తిచేసుకొని, నిశ్చింతగా ఇంటికి మరలి వస్తున్నది.

సంపుటి 8
సంచిక 4

ఏప్రెల్
1951

# చందమామ

సంచాలకుడు : చక్రపాణి

'రామ' అనే రెండక్షరాలూ మనసుకి తట్టేసరికి అదేదో చెప్పలేని ఆనందం కలుగుతుంది. యుగయుగాలుగా ఈ రామనామసుధను గ్రోలి ఎందరెందరో తరించారు. అటువంటి తారకనామం ఈ నెల 15-వ తేదీ శ్రీరామ నవమినాడు దేశమంతటా మార్మోగుతుంది. రామనామ మహిమను వెల్లడించే గొప్ప పుస్తకం రామాయణం. ఇందులో పెద్దలూ పిన్నలూకూడా తెలుసుకోవలిసిన మహత్తర విషయాలెన్నో వున్నాయి. అందుకనే దీనిని మహాకావ్యమన్నారు. పెద్దలకు అవసరమైన ఉదాత్త విషయాలేగాక బిడ్డలకు వినోదాన్నికూర్చే చిత్రాలుకూడా ఎన్నో వున్నై. రామనామం సప్తసంఖ్యా ప్రధానమైంది. ఎలా అంటే, దశావతారాలలో రామావతారం ఏడవది. రామాయణంలో గల కాండలు 7. రామరావణయుద్ధం 7 రోజులు జరిగింది. యుద్ధంలో ముఖ్యవీరులు 7గురు. ఇంతెందుకూ! మనం ద్వేషించే ఆ రాక్షస దంపతులు రావణ, మండోదరుల పేర్లలో మొదటి అక్షరాలు కలిపి చూడండి. రామనామమహిమను మీరే గ్రహిస్తారు. ఇటువంటి మహిమలను తెలిపే అనేక గాథలలో ఒకటి ఈ నెల మీరు చదవబోయే 'శ్రీరామదర్శనం.'










# మంచి బాలుడు

తళతళ మిలమిల మెరపులు మెరసీ
హోరున, జోరున వర్షం కురిసీ
వీథుల్లో కాల్వలు కట్టాయి.
కాల్వలనిండా నీళ్లొచ్చాయి.

చెప్పులు తడిసీ, బట్టలు తడిసీ
చిందే నీళ్లకు, బురదకు జడిసీ
జనులు మెల్లగా పోతున్నారు.
లేకుంటే జారే పడతారు.

ఆ త్రోవను పాపం ఒక ముసలిది
కాటికి కాళ్లు చాచినట్లున్నది
గడగడ వణికీ, తడబడి తొణికీ
అడుగులు లెక్కిడితూ పోతున్నది.

ఇంతలోన దగ్గరలో ఒక బడి
వదలిపెట్టగా పిల్లలు వడివడి
కేకలు వేస్తూ, పరుగులు తీస్తూ
వచ్చారెంతో సందడి చేస్తూ.

మెదలక ఎవరి త్రోవనే వారు
పిన్నలు పెద్దలు పోతున్నారు.
వణికే తొణికే ఆ ముసలమ్మకు
ఎవ్వరు సాయం చేసేవారు ?

రచన:
"బైరాగి"

కిలకిలలాడే, ఆడే, పాడే
బాలుర అడుగులు అనవు భూమిని.
వారు అసలు చూచారో, లేదో
గడగడ వణికే ముదుసలిఆమెను.

కాని వారిలో ఒక్క బాలుడా
ముదుసలి అవ్వను చూచి, జాలిగొని
చేయి బట్టి గొనిపోయాడామెను
విడచివచ్చినా డామె భవనమున

తిరిగివచ్చి తన తోటివారితో
అన్నాడాతడు – "స్నేహితులారా!
ఆ ముసలమ్మకూడ మరియొకరికి
అమ్మయని ఆలోచించారా?

మరి మాయమ్మ కూడ ముదుసలియై
నే దూరానెచటో ఉన్నప్పుడు,
అవసరమందు ఆదుకొని దయతో
సాయం చేయొద్దా మరిఒక్కడు?"

ఇదివిని ప్రతిబాలుడు తన మనమున
సిగ్గుజెంది అనుకొన్నాడిట్లని—
"దుర్బలులకు సాయం చేయనియెడ
కొరగాదెందుకు మనుజుని మనుగడ."





# శతపత్రసుందరి

ఘూర్జరదేశంలో అగ్నిమిత్రుడనే రాజపుత్రుడొకడుండేవాడు. అందం చందం, బలం శౌర్యం ఉన్నవికాని అతనికి రాజ్యం మాత్రం లేదు. ఏనాటికైనా అదృష్టం పట్టకపోతుందా అనే అశతో బయల్దేరి పోయి పోయి మళయాళదేశం ప్రవేశించాడు.

అతనికి ప్రయాణంలో నదులు, అడవులు కొండలు ఎన్నెన్నో తగిలాయి. నడిచినంతదూరం నడిచి, లభించిన ఆహారం ఏదో తిని, మధ్య మధ్య ఎక్కడో అక్కడ పడుకుంటూ శ్రమ తీరేక ముందుకు కాలుసాగిస్తూ వచ్చాడు. ఇలా కొన్నిరోజులయేసరికి శంకరగిరి అనే కొండదగ్గిరికి చేరుకున్నాడు. చీకటిపడటంచేత ఆనాటికి అక్కడ విశ్రమించి అగ్నిమిత్రుడు ఆ కొండ వరియలో పడుకున్నాడు.

పడుకుని ఇంకా కళ్లు మూయకుండానే అతనికి ఎదురుగా ఒక గొప్ప దేవాలయం కనపడింది. అది చాలా అద్భుతమైన దేవాలయం. దాని విశేష మేమిటంటే- ఇటుకా, సున్నం, రాళ్లతోట్టిన గుడి కాదది! అంతా బంగారమే! గుడిమీదా, గోపురం మీదా, ప్రాకారాలమీదా మండపంమీదా ఉండే శిల్పమంతా నవరత్న మణిమయమై వున్నది. నివ్వెరపోయి చూస్తూన్న అగ్నిమిత్రుడి కళ్లు జిగేలుమన్నాయి.

ఇంకొక చిత్రం: అంతకు ఒక్కక్షణం ముందు ఆ దారివెంబడే నడిచి వచ్చిన అతడికి ఈ దేవాలయం కనపడనేలేదు. మరైతే ఇంతట్లో ఎక్కడనుంచి వచ్చిందీ! ఇదేదో ఇంద్రజాలమనిపించిందతడికి. మంత్రాలకీ, గారడీలకీ మళయాళదేశం పేరుపొందినది కదా. అందువల్ల ఇదీ యేదో మాయలాగే వుంది. లేకపోతే ఒక్క చిటికలో ఇంత గొప్ప దేవాలయం ముందు వచ్చి ప్రత్యక్షం కావడమేమిటి!

వి. కళ్యాణసింగు, చక్రధరపురం





అగ్నిమిత్రుడు ఆశ్చర్యపోతూ ఆలోచించుకునేటప్పటికి అతనికొక బుద్ధి పుట్టింది. అది నిజమైన దేవాలయమో లేక ఉత్తి భ్రమో చేతితో తాకితే తెలిసిపోతుందని తోచి, పడుకున్నవాడల్లా లేచాడు.

అతడు లేచీ లేవటంతో అంతవరకూ దేదీప్యమానంగా ప్రకాశిస్తూ కనపడ్డ ఆ దేవాలయం, గోపురప్రాకారాలూ, సమస్తం అదృశ్యమైపోయి, అంతా అంధకారమైపోయింది. దానితో అతడు భయపడిపోయి, ఒక్క అడుగుకూడా ముందుకి వెయ్యలేక మళ్లీ అక్కడే కూలపడిపోయాడు.

ఐతేం, పడుకోటంతోనే మళ్లీ ఆ గుడీ గోపురం అన్నీ అతనికి మునపటిలాగానే ఎక్కడివక్కడ కనపడ్డాయి! లేచి పట్టుకుందామంటే మాయమైపోతున్నై. తిరిగి పడుకుంటే కనుపడుతున్నై! ఇదంతా నిజమా స్వప్నమా ?' అనుకుంటూ అగ్నిమిత్రుడు ఒకమాటు గట్టిగా వొళ్లు గిల్లుకు చూసుకున్నాడు. ఆ చోట నొప్పి పెట్టి తను చూస్తోన్నది నిజమేననీ కలగాదనీ తేలింది.

గుడిగోడ ముట్టుకుందామని మళ్లీ తోచి లేచాడు. ఏమయింది? ఇదివరకు మల్లేనే గుడి మాయమై చీకటి ప్రత్యక్షమైంది.

ఏమీ తోచక అక్కడే పరున్నాడు మళ్లీ. వెంటనే దేవాలయం ప్రత్యక్షమైంది! లేస్తే ఎక్కడ మాయమైపోతుందో అన్న భయం కొద్దీ అతడలాగే పరుండి ఆ దృశ్యాన్ని చూస్తో ఉండిపోయాడు. అతనితోపాటు ఆ దృశ్యంకూడా అలాగే ఉండిపోయింది.

కాని కాస్సేపయేటప్పటికి అతని చెవిని పుటుక్కుమని చీమ ఒకటి కుట్టింది. తటాల్న లేచాడు. గుడి అదృశ్యమైంది. 'ఐతే అయింది. ఈ కుట్టినది చీమా మరొకటా ?' అంటూ కూచుని, అతడు అక్కడ చేత్తో వెతకటం మొదలెట్టేడు. అతని చేతికేదో మూలికలాంటింది చిక్కింది. ఆ క్షణమే



గుడి ప్రత్యక్షమైంది! 'కూచున్నా గుడి కనపడిందే ఈమాటు?' అంటూ ఆ మూలిక చేతిలో ఉంచుకొనే లేచాడు. గుడి కనపడుతోనే ఉంది. ముందుకు నడిచాడు. గుడి కనపడుతోనేఉంది! వెళ్లి తాకాడు!

నిజంగా ఆ గుడిగోడలు బంగారపు గోడలే! ఆశిల్పంలో అతికినవన్నీ కెంపులూ, పచ్చలూ, మరకతాలూ, మాణిక్యాలే! అంతసేపూ పడుకున్నప్పుడు కనపడి, లేస్తే మాయమై పోతూవుండటానికి కారణం ఆ మూలికే' అని అగ్నిమిత్రుడికి రూఢి ఐంది. అతడు పడుకొనివున్నప్పుడు తన తలకు ఆ మూలిక తగిలి ఆ దృశ్యం కనపడటం, లేచినప్పుడు మూలిక సంపర్కం లేక ఆ దృశ్యం అదృశ్యం కావటం జరిగిందనీ, ఇప్పుడామూలిక చేతిలోనే ఉండటంవల్ల ఆ గుడి కనపడటమే కాకుండా, దాని గోడల్ని తాకగలుగుతున్నాననీ గ్రహించాడు.

అంతవరకూ వచ్చాక ఆ దేవాలయంలో ప్రవేశించి, అక్కడ యేమేమి చిత్రాలున్నాయో చూడాలని ఎవరికనిపించదు? అగ్నిమిత్రుడు మూలికతోసహా లోపలకి చొరబడ్డాడు. గర్భాలయానికి ముందున్న మండపంలోంచి వెడుతూంటే రెండు పక్కలా అటొకఐదూ, ఇటొకఐదూ పది బంగారపు గోలేలు కనిపించినై.

ఆ గోలేలు చాలా ఎత్తుగాఉండి అగ్నిమిత్రుడు బొటనవేళ్లమీద నిలబడి తొంగి చూస్తేగాని లోపల యేమున్నదీ కనపడింది కాదు. మొదటి గోలెంలో బాతుగుడ్లంతలేసి ఎర్రటి కెంపులున్నాయి. ఇంకో దాంట్లో పచ్చలున్నాయి. వేరొకదానిలో గోమేధికాలున్నాయి. అలాగే ముత్యాలు, పగడాలు, నవరత్నాలలో ఇంకా మిగిలినవీ ఉన్నాయి. పదోగోలెంలో బంగారు మొహరీలున్నై.

అగోలేలన్నీ చూసేటప్పటికి అగ్నిమిత్రుడికి మతిపోయింది! పైనున్న తువ్వాలు



పరచి ప్రతిగోలెంలోంచి పిడికెడేసి తీసి పోసుకుని మూటగట్టబోయాడు. ఐతే, చిత్రమేమోకాని, ఆ పదిపిడికిళ్ల రత్నాలలోనూ దినుసుకొక్కటి చొప్పున మిగిలి, తక్కినవన్నీ దేని గోలెంలోకి అది వెళ్లిపోయింది!

అగ్నిమిత్రుడు బుద్ధిమంతుడు గనక, 'అత్యాశ పనికిరాదు' అని తెలుసుకుని అవి మూటగట్టుకుని, గర్భాలయం ప్రవేశించాడు.

అతనికి ఎదురుగా నూరు రేకుల బంగారపు కమలం మీద కూర్చునిఉన్న లక్ష్మీదేవి ప్రసన్న ముఖంతో కనపడింది. ఆమె పాదాలవద్ద 'శతపత్రసుందరి' అన్న అక్షరాలు విద్యుద్దీపాలకుమల్లే మెరుస్తో కనపడ్డాయి. ఆ సుందరమూర్తికి అగ్నిమిత్రుడు చేతులుజోడించి భక్తిపారవశ్యంతో 'శతపత్రసుందరీ!' అని నమస్కారం చేశాడు. ఆ పారవశ్యంలో అతని చేతిలో వున్న మూలిక క్రింద పడిపోయింది. ఇంకేముంది? కళ్లుతెరిచి చూచేటప్పటికి శతపత్రసుందరికాని, గోలేలుకాని, దేవాలయం గాని లేవు! అతడు మూలికకోసం అక్కడంతా తడిమేడు. లాభంలేకపోయింది. బుజంమీద మూటమటుకు రత్నాలతో సహా అలాగే వుంది.

'ప్రాప్తమెంతో అంతే' అనుకుంటూ అగ్నిమిత్రుడు ఆ కొండదిగి వెళ్లిపోయాడు.

ఆ కొండకి ఆవల ఒక మహాపట్టణం కనపడింది. అందులో ప్రవేశించేటప్పటికి అగ్నిమిత్రుడికి ఏదో చాటింపు వినపడింది. సరీగ్గా బోధపడక అతడు 'ఏమిటయ్యా ఆ చాటింపు?' అని, ఆ దారిని పోతూన్న ఎవరినో అడిగేడు. వాడు, 'మామూలు చాటింపేనయ్యా' అన్నాడు.

'నేను కొత్తవాణ్ణి. మీకు మామూలేఐనా ఆ చాటింపేదో నాకు కొత్తేకద' అన్నాడు అగ్నిమిత్రుడు. అప్పుడు వాడు, "అలాగైతే విను. మా రాజుగారి కొక కూతురుంది.

అవిడకి పిచ్చి. పెళ్లి చేసుకోమంటే, 'శతపత్రసుందరి ఆలయంలో ఉన్న రత్నాలు తెచ్చినవాణ్ణి కాని పెళ్ళి చేసుకోను' అంటుంది. చిన్నప్పుడు ఎవడో యోగివచ్చి, అలా రత్నాలు తెచ్చినవాణ్ణే కాని పెళ్ళి చేసుకోవద్దని చెప్పాడట. 'ఎక్కడుంది ఆ గుడి?' అంటే 'నాకుమాత్రం తెలుసా?' అంటుంది. అలాంటి గుడి ఈ లోకంలో ఉంటేగదా తెలియటానికీ, ఆ రత్నాలు తేవటానికీని? కూతురుకుతగిన తండ్రే మా రాజుగారు! ఆ రత్నాలుతెచ్చినవాడికే తన కూతుర్నిచ్చి పెళ్లిచేస్తాననీ, రాజ్యంఇస్తాననీ రోజూ చాటింపు వేయిస్తాడు. తెలిసిందా?" అని ఒక వెకిలినవ్వు నవ్వి తనదారిని తను పోయాడు.

అగ్నిమిత్రుడు వెంటనే రాజుగారిదగ్గర కెళ్ళి, 'నేను శతపత్రసుందరి ఆలయం లోంచి రత్నాలు తెచ్చాను' అన్నాడు. అక్కడ ఉన్నవాళ్లంతా, 'మరో పిచ్చివాడు వచ్చాడు' అనుకున్నారు. కాని అగ్ని మిత్రుడు మూటవిప్పి రత్నాలు చూపించే టప్పటికి వాళ్లనోళ్లు కట్టుపడ్డాయి.

వాళ్లంతా 'పిచ్చది' అనుకుంటూన్న రాజుగారికూతురు ఈ సంగతివిని ఎవరూ పిలవకుండానే పరుగెత్తుకొచ్చి, జిగేల్ జిగేల్ మనే ఆ రాళ్ళూ, ఆ రాళ్లముందు ముసి ముసినవ్వులతో మెరిసిపోతూన్న అగ్ని మిత్రుణ్ణీ చూసి, అతనిమెడలో పూలదండ వేసేసింది! అక్కడివాళ్లంతా, అతనిచుట్టూ మూగి, 'ఆ శతపత్రసుందరి గుడి ఎక్కడుందో చెప్పరూ?' అంటూ కాళ్ళా వేళ్ళా పడ్డారు.

అగ్నిమిత్రుడు దాపరికం లేకుండా ఆ మూలిక మహిమ చెప్పి, అది దొరికినవాళ్లకి గాని ఆ గుడి కనపడదనే రహస్యం వెల్లడించాడు. మూలిక సంగతి విన్నవాళ్లు శంకరగిరిపోయి, వెతకటం మొదలెట్టేరు. యిప్పటికీ అలా వెతుకుతూనేఉన్నారు.






## 10

[రాక్షసుడి మాయవల్ల అసలుస్వరూపాలు పోయి ఒకడు శిలాప్రతిమగాను, రెండవవాడు కోతిగాను కవలసోదరులు ఎలామారిపోయారో, తిరిగి మామూలురూపాలు ఎలాపొందారో, రాక్షసుణ్ణిగురించి రాకుమార్తెలు చెప్పిన రహస్యం ఏమిటో చదివారుకదా? అతర్వాత]

త్రమవద్దనున్న భస్మాలూ, అంజనాలూ రాక్షసుడి భూగృహంలో పనిచెయ్యవు అని తెలిసినప్పటినుంచీ, మన కవల సోదరులు వేరే మార్గం ఏమిటా అని ఆలోచించ సాగారు. ఇలా ఆలోచిస్తూపోగా వాళ్లకి ఒక సందేహం కలిగింది.—“ఈ రాక్షసుడు ప్రపంచంలో ఎక్కడెక్కడి కవలలనూ యిట్టే పసిపట్టి తెస్తాడుకదా! యింతకాలం మన జోలికిరాకుండా వూరుకొనటానికి కారణం ఏమైవుంటుందీ?” అని.

మర్నాడు వాళ్లు రాకుమార్తెలను కలుసుకొన్నప్పుడు ఉదయనుడు తమకుకలిగిన ఈ సందేహాన్ని వెల్లడించేసరికి, వాళ్ళూ ఆశ్చర్యపోయారు. “నిజమేసుమా! మాకు యింతవరకు ఈ సందేహమే కలగ లేదు. బహుశా ఒక కారణంవల్ల వాడు మీ జోలికి రాకుండా ఉండివుంటాడని యిప్పుడు నాకు తోస్తున్నది. ఐతే...”అని వూరుకున్నది సుభాషిణి.

“ఫరవాలేదు, చెప్పు. నీవు వూహించిన కారణమే నిజమైతే తగుజాగ్రత్తలో ఉండవచ్చుకదా” అన్నాడు నిశీధుడు.

అప్పుడు సుభాషిణి—“ఏమీ లేదు. ఏ విధమైన అవయవలోపమున్నా ఆ కవలలు రాక్షసుడి బలికి పనికిరారు. బలి యివ్వబోయే సమయమందు ఈ విషయాన్ని



వాడు బాగా పరిశీలిస్తాడు. చూడగా మీకు అలాంటి లోపాలేవీ మామట్టుకు కనుపించ లేదు. కనుకనే యిలా మిమ్మల్ని అడగ టానికి జంకు కలిగింది" అన్నది.

ఇది వింటూనే కవలసోదరులు ముగ్గురు ఒక్కసారిగా "నీకు సరియైన సందేహమే కలిగింది" అన్నారు.

తర్వాత ఉదయనుడు పుట్టుకతో తమ చూపుల విషయంలో ఎలాంటి లోపాలుండేవీ, ఆతర్వాత గెడ్డపువాడి పుణ్యమా అంటూ ఆ లోపాలు ఎలా తొలగిపోయిందీ రాకుమార్తెలకు విస్తరించి చెప్పాడు.

వాళ్లు యిలా మాట్లాడుకొంటుండగా రాక్షసుడి రాక తెలిపే సుడిగాలి ప్రారంభ మైంది. వెంటనే రాకుమార్తెలు కొలను లోనికి వెళ్లిపోయారు. కాని, పాపం ఈసారి మన కవలసోదరులు తప్పించుకోలేక పోయారు. ఉదయనుడు తనవద్దవున్న భస్మం తీసి సరీగ్గా మీదచల్లుకోబోయేసరి కల్లా రాక్షసుడు అమాంతం ప్రత్యక్షమై వాళ్ల ముగ్గురునీ తన గుప్పిటిలో చిక్కించు కొన్నాడు.

మన కవలసోదరులు లోలోపల భయంతో గజగజ వణికిపోతున్నా పైకి మాత్రం ధైర్యంగానే వున్నారు.

అప్పుడు రాక్షసుడు—"ఎవరు మీరు? ఈ నా రహస్య ప్రదేశానికి ఎలా వచ్చారు? నిజం చెప్పండి. లేదా యింతకుముందు వచ్చిన వాళ్ల గతి యేమయిందో అదేమీకూ అవుతుంది" అని గర్జించాడు.

అందుకు ఉదయనుడు— "నిజమే నయ్యా. ఇక్కడికి రావటం కష్టమనీ, ఎంతో ప్రమాదకరమనీ, తీరా యిక్కడికి వచ్చాకకాని మాకు తెలియనేలేదు. ఐనా మేము ప్రాణాలకు తెగించి వచ్చాం కనుక మేముచెప్పే యదార్థం విని, ఆ తరువాత

నీ యిష్టమొచ్చినట్టు చేసుకో" అన్నాడు ఉదయనుడు.

"ఓహొ! 'పిట్ట కొంచెం కూత ఘనం' అన్నట్టుందే మీ వాలకం చూడగా? మా తమ్ముణ్ణి టోపీవేసింది మీరేకదూ? సరే, అసలిక్కడికి ఇలా దొంగతనంగా ఎందుకొచ్చారో చెప్పండిముందు" అని గద్దించాడు రాక్షసుడు.

"అదే పొరపాటు. మేము దొంగతనంగా రాలేదు. అలా రావలసిన అవసరం మాకు లేదు. మేము వచ్చిన పని ఏమిటీ అంటే ......" అని ఉదయనుడు ఏమో చెప్పబోతుండగా—

"ఏమిటి ఏముంది? నాకు టోపీ వేయటానికే" అనే మాటలు వినిపించినై.

ఆ మాటలు వచ్చిన దిక్కుకి తిరిగి చూచేసరికి, మొట్టమొదటగా తాము ఎవరినైతే మోసపుచ్చి గెడ్డపువాడిదగ్గరకు పంపారో ఆ రాక్షసుడే తమవైపు చరచర నడిచివస్తూండటం కనుపించింది.

వాడు వస్తూనే—"అన్నా, వీళ్ల సంగతి యిక నేను చూచుకుంటాను. కాలం వృథా పుచ్చకు. నీ వేటకి నువ్వు పో" అన్నాడు.




తమ్ముడు ఎప్పుడైతే యిలా అన్నాడో అప్పుడు రాక్షసుడు "యిదేదో పెద్ద గాథలాగా ఉన్నది. వీళ్లు మా తమ్ముడికి తెలిసినవాళ్లుగానే కనిపిస్తున్నారు. కనుక వీళ్ల సంగతి వాడే చూచుకోవటం మంచిది" అనుకుంటూ తిరిగి గద్దరూపంలో రివ్వున ఆకాశమార్గాన వెళ్లిపోయాడు.

ఆవెంటనే రాక్షసుడు మన కవలసోదరులను వెంటబెట్టుకుని తను కాపలా కాసే భవనంలోకి తీసుకుపోయాడు. వాళ్లని సావకాశంగా కూచోబెట్టుకుని "అబ్బాయిలూ! గెడ్డపువాణ్ణి టోపీవేశారు. నన్ను టోపీవేశారు. ఇప్పుడు మా అన్నను టోపీవెయ్యజూచారు.




కాని పాపం మీ ఆటలుసాగక, నా చేతిలో చిక్కిపోయారు. గెడ్డపువాడిదగ్గిర మీరు కాజేసిన అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూ అన్నీ అక్కడ పెట్టండి. తర్వాత తక్కిన సంగతులు మాట్లాడుకుందాం" అన్నాడు.

పాపం, ఏమిచేస్తారు కవలసోదరులు? తప్పనిసరిగా ఆ వస్తువులన్నీ అక్కడపెట్టి వేశారు. అప్పుడు రాక్షసుడు "అబ్బాయిలూ! ఇంతకాలంగా యిక్కడ కాపలా కాస్తున్నాగాని నన్ను తప్పించుకు లోపలికి పోయినవాళ్లు ఒక్కరూ లేరు. ఎవరు వచ్చినా నా చేతిలో చిక్కిపోయి శిలాప్రతిమలుగా మారిపోవలిసిందే. అదిగో చూడండి వాళ్లంతా యింకా ఎలాగ అఘోరిస్తున్నారో. అలాంటిది ఆ రోజున మీరు నాకు టోపీ వేసినప్పటినించీ నేను కడుపునిండా తిండి కూడా తినటంలేదు. భలే ఆకలిగావున్నది. ఈ నెలరోజుల వారా మీ పేరు చెప్పుకుని, యివాళ లక్షణంగా కడుపునింపుకొంటా" నంటూ మాయతువ్వాలు పరిచి ఆహారం కోరుకున్నాడు.

తన కడుపు బాగా నింపుకొని రాక్షసుడు కవల సోదరులకుకూడా వాటిల్లో కొన్ని ఫలాలు యిచ్చాడు తినమని. వాళ్లుకూడా కడుపులు నింపుకొన్న తర్వాత రాక్షసుడు వాళ్లని ముగ్గురినీ ఒక త్రాటితో కట్టివేసి "కాసిని నీళ్లు తాగి వస్తాను, వుండండి" అంటూ కొలనువైపుకి వెళ్లాడు.

మరికొద్దిసేపటికి రాక్షసుడు ఒక మూడు ఆకుదొన్నెలతో నీళ్లు తీసుకొని తిరిగివచ్చి వాటిని సోదరులకు యిచ్చాడు.

ఇదంతా తమపైన అభిమానంతోనే చేస్తున్నాడనుకున్నారు సోదరులు. అందుచేత వాడు యిచ్చిన నీళ్లు గడగడ త్రాగివేశారు. నీరు గొంతుదిగేసరికల్లా ఇంకేముంది పాపం, ముగ్గురూ మూడు శిలాప్రతిమ లయిపోయారు.

ఇలా కాగానే రాక్షసుడు 'హా! హా!! హా!!!' అంటూ ఆ భవనం ప్రతిధ్వనించేట్టు విరగబడి నవ్వుతూ ఈ కొత్త శిలా ప్రతిమలను తను కాపలాకాస్తున్న వాకిలి ప్రక్కన వుంచాడు.

ఇక్కడ ఈవిధంగా కపలసోదరులు ముగ్గురూ చిక్కుపడిపోయారా? ఇక అక్కడ దానశీల మహారాజూ, రాణీ పద్మముఖీ ఎలా వున్నారో ఒక్కసారి చూదాం.

* * *



తన ముద్దుల కూతుళ్లు ముగ్గుర్నీ వెతుక్కు రావటానికని కవలసోదరులకు గుఱ్ఱాలిచ్చి పంపినరోజునే రాజు ఒకపని చేశాడు. కోట పైఅంతస్థుమీద ఒక చిత్రమైన చిన్న గది కట్టించుకున్నాడు. అగదిలో కూర్చుని చూచినట్టయితే చుట్టుప్రక్కల కనుచూపు మేరలో ఎక్కడ ఎటువంటి సంచారం వున్నా స్పష్టంగా కనుపిస్తుంది రాజుకి. ఈ గదిలో కూచుని రోజు యిరవై నాలుగు గంటలూ కన్నులు కాయలు కాచేట్లు చూస్తూవుండటమే ఆయన పని.

కవలసోదరులు బయల్దేరి ఇప్పటికప్పుడే అయిదేళ్లు దాటింది. ఇంతవరకు వాళ్ల అతీ గతీ లేదు. అందుకని రోజురోజుకీ రాజుకి వ్యాకులత హెచ్చు కాజొచ్చింది. అయినా ఆశ పీడించటంచేత మధ్యమధ్య అస్థాన జ్యోతిష్యుని సంప్రతిస్తునేవున్నాడు. 'అమ్మాయిలు ఎక్కడనో జీవించేవున్నారనీ, సుఖంగా తిరిగి రాగలరనీ, నిస్పృహ చెందవలసిన పని లేనేలేదనీ' జ్యోతిష్కుడు కచ్చితంగా చెబుతూ వుండటంచేత రాజు ఎలాగో ప్రాణాలు ఉగ్గబట్టుకు వుంటున్నాడు.

ఒకనాడు తెల్లవారుజామున మసక చీకటిగావుండగా రాజు యథాప్రకారం గదిలో కూచుని చూస్తూవున్నాడు. ఆ మసక వెలుగులో దూరాన రెండుగుఱ్ఱాలు శర




వేగంతో తన భవనంవైపు రావటం కనిపించింది. ఆ గుఱ్ఱాల రంగూ, వాటిపైన మనుష్యుల ఆకారాలూ, వీటిమాటకేం, వాటిని కట్టివున్న ఆ నల్లజెండాలూ చూచేసరికి రాజు కెవ్వున కేకపెట్టి బాకుతో పొడుచుకోబోయాడు. దైవవశాత్తు, కేకవిన్న సేవకులు రెప్పపాటులో అక్కడకు చేరుకోవటంవల్ల ఆ ప్రమాదం కాస్తా తప్పింది. ఐతే, రాజు స్పృహతప్పి పడిపోయాడు.

కొంతసేపటికే రాజు తెప్పరిల్లుకోవటమూ, ఆ గుఱ్ఱాలు రెండూ అక్కడకువచ్చి చేరుకోవటమూ ఒక్కసారిగా జరిగింది.

ఆ వచ్చిన గుఱ్ఱాలు కవలసోదరులకు స్వయంగా తను యిచ్చిపంపినవే. అయినా వాటిపైన వచ్చినది కవలసోదరులు కాదు! వాళ్లు తన సేవకులు!!

వాళ్లవైపు రాజు ఆత్రంగా పరుగెత్తుకెళ్ళి "అమ్మాయిలు ఏరీ? ఆ కవలపిల్లలేరీ? ఈ గుఱ్ఱాలు ఎక్కడివిమీకు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

అందుకు సేవకులు—"మహారాజా! క్షమించండి. అమ్మాయిల సంగతిగానీ, కుఱ్ఱవాళ్ల సంగతిగానీ మాకేమీ తెలియదు. ఊరూరా మేము వెతుక్కొంటూ పోగా

పోగా ఒకానొక మైదానంలో ఈ అశ్వాలు మాకు కనుపించినై. వీటిని వెంటనే పోల్చుకుని, మన అమ్మాయిలూ, ఆ కవలలూ కనపడతారేమోనని ఆ ప్రదేశమంతా కలియ వెతికాము. ఎంతకూ వారి జాడ తెలియకపోయేసరికి, ఒకవేళ వారు ఇంటికే చేరుకున్నారేమో చూడాం, లేదా ఇంతవరకు వర్తమానమైనా అందించుదాం అని మేము వచ్చేశాము ప్రభూ!" అని విన్నవించుకున్నారు.

అంతావిని, 'అంతటి అదృష్టమా!' అంటూ రాజు తిరిగి దుఃఖంతో పడిపోయాడు.

అంతాచేరి రాజుకు ధైర్యంచెప్పి పూరడించగా తిరిగి మనస్తిమితం చిక్కినతర్వాత గుర్రాలపైన ఎక్కివచ్చిన సేవకు లిద్దరను ఎదటికి పిలిచి "ఓరి వాజమ్మల్లారా!— అమ్మాయిలను వెదికి వెంటబెట్టుకు రాక ఎందుకని వచ్చినట్టు మీరు? వాళ్లను వెతక బోయిన కవలసోదరుల గతి యేమైందో పాపం! ఆ కసుగందులు ఏమి ఆపదలలో చిక్కుకున్నారో! లేకుంటే వాళ్ల జాడ తెలియకపోవడ మేమిటి ఇంతవరకూ? నాకు పూర్తిగా ప్రాణం విసిగిపోయింది. క్షణం కూడా నిలవలేకపోతున్నాను. మళ్ళీ మీరు వెంటనేవచ్చే ఆశ వున్నదా? ఏమో, మీరు తిరిగివచ్చేలోపల నాపని ఎలా వుంటుందో. సరే పోయిరండి!" అంటూ వాళ్లను సాగనంపాడు.

ఈ సేవకులు వచ్చిన వర్తమానం ఆ నోటా ఆనోటా అంతఃపురంలోకి పాకిపోయి, ఆదమరిచివున్న రాణికి మళ్లీ పిచ్చిపట్టింది.

---

[అక్కడ మన సోదరులగతి ఏమైందిపాపం? వాళ్లు అలా శిలాప్రతిమలుగానే వుండిపోయారా? అసలు ఇలా జరిగినట్టు రాకుమార్తెలకు తెలుస్తుందా, లేదా? ఈ సమస్యలన్నీ వచ్చేనెల]






చాలాకాలం కిందట ఒక గ్రామంలో నిష్ఠాపరుడైన ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు దివ్యక్షేత్రాలు దర్శించుకువద్దామనీ, పుణ్యనదులన్నిటిలోనూ మునిగి తరించుదామనీ ఎంతో ఆసక్తిగా వుండేది. ఐతే, పుట్టుపేద కావటంచేత చెయిసాగక, కోరిక నెరవేరిందికాదు.

ఇంతలో ఆ బ్రాహ్మణుడికి కాలం సమీపించగా, ఒక్కగానొక్క కుమారుడైన చైనుల్ని చేరబిలిచి, "నాయనా!—ఎంత యత్నించినా నా జీవితంలో తీర్థయాత్రలు సేవించుకోవటం గాని, పుణ్యనదులలో స్నానం చేయటంగాని పడలేదు. ఈ కోరిక అలానే నిలిచిపోయింది. కాబట్టి, నీకైనా సావకాశం చిక్కినట్టయితే, నా అస్తులను వీలైనన్ని పుణ్యనదులలో కలపవలిసింది. ముఖ్యంగా పవిత్రమైన గంగానదిలో కలపవలిసింది. ఈ ఒక్క పని నీవు చేశావంటే నా ఆత్మ సంతృప్తి పడుతుంది. నాకు ముక్తిమార్గం యేర్పడుతుంది" అంటూ తన తుదికోరిక వెల్లడించి దేహయాత్ర చాలించాడు.

చైనులు పితృభక్తి కలవాడు. అందుచేత అతడు 'అప్పొ సొప్పొ చేసి ఐనా సరే, తండ్రి కోరిక నెరవేర్చి తీరాలె. కొడుకుననిపించుకుంటూ, ఈమాత్రం పని చేయలేకపోతే, నాజన్మ యేం జన్మ!' అనే సంకల్పంతో బయల్దేరిపోయి, ఎన్ని కష్టాలకైనా ఓర్చి కాశీక్షేత్రం దర్శించుకుని తండ్రి అస్తులు గంగానదిలో కలపాలని నిశ్చయించుకున్నాడు.

ఆ కాలంలో ఇప్పటిలాగా రైళ్లా, విమానాలా, ఇట్టె వెళ్లి అట్టె రావటానికి! కాలినడకని పోవాలి. కీకారణ్యాలు దాటాలి. కష్టసుఖాలు ఒంటపట్టించుకోవాలి. ఇన్ని జరిగినా, బయల్దేరిన మనిషి మళ్లీ ఇల్లు

పిళ్లా మల్లునాయుడు - అనకాపల్లి

చేరుకునేవరకూ నమ్మకం లేకపోయె!— అందుకనే 'కాశీకి వెళ్లినవాడూ కాటికి పోయినవాడూ తిరిగిరారు' అనే సామెత కూడా యేర్పడినట్టుంది.



చైనులు పాదచారి అయి బయల్దేరాడు. రోజుకొక గ్రామం చొప్పున సంచారం చేస్తూ, దారిలో తగిలిన క్షేత్రాలన్నీ దర్శిస్తూ, పరలోకాన ఉండే తండ్రికి గతులు కల్పిస్తూ వెళుతున్నాడు. పోయి పోయి అతడు కడప జిల్లాలో కాలు పెట్టాడు. అక్కడ పినాకినీ నది ప్రవహిస్తున్నది. 'సరే, ఇందులోకూడా స్నానంచేసిపోదాం' అనుకుని, అస్తులమూట ఆ దగ్గరనే పెట్టి చైనులు నదిలో దిగాడు.

అతడు స్నానం చేసికొని, సంధ్య వార్చుకుని వచ్చి, మళ్లీ మూట బుజాన వేసుకుపోదామనుకొన్నాడు. తీరా చూడగా, ప్రవహించే పినాకినీనది పొంగువచ్చి ఆ మూటంతా తడిసిపోయివున్నది. 'సరే, తడిగుడ్డ అరబెట్టి మళ్లీ కట్టుకుందామనే ఉద్దేశంతో మూట విప్పాడు.

మూట విప్పేసరికి, అస్తులు మాయమై, వాటికి బదులు అమోఘంగా పరిమళిస్తున్న తెల్లటి మల్లెపువ్వులు కనుపండువుగా కనిపించినై! ఇవి చూచి చైనులు ఆశ్చర్యంతో చకితుడయాడు. "అహా, పినాకిని జలం ఎంతటి మహిమ కలది! కాశీలో వుండే గంగాజల మహత్యం ఎటువంటిదో నేను ఎరుగను. కాని, పినాకిని మహిమ కళ్లారా ప్రత్యక్షంగా చూడగలిగాను. నా తండ్రికి తరణోపాయం కలిగింది. ఆయన ముక్తి పొందేశాడు. నా విధి నేను నెరవేర్చుకొన్నవాడినయాను. ఇక నేను కాశీకి పోనక్కరలేదు. ఇక్కడనే ధన్యుడనయాను" అంటూ అపరిమితానందభరితుడై, తండ్రిని స్మరిస్తూ ఆ పువ్వులను పినాకినీ ప్రవాహంలో కలిపివేసి ఇంటిముఖం పట్టాడు.



ఏమి చిత్రమో కాని, చైనులు స్నానం చేసిన తావు ఒక మడుగుగా యేర్పడింది. ఆ మడుగు నీలాటి రేవుకి సదుపాయంగా ఉండటంచేత స్త్రీలందరూ అక్కడ స్నానాలు చేసి, నీళ్లుపట్టుకునేవాళ్లు. పశువులు కూడా వచ్చి దాహం తాగేవి.

ఒకరోజున ఒక ముసలివాడు పశువులకు నీళ్లెట్టడానికని ఆ రేవుకి వచ్చాడు. బక్క చిక్కవున్న ఆ పశువులు మడుగులో నీళ్లు తాగి ఇవతలకు వచ్చేసరికల్లా మిసమిసలాడుతూ బలంగానూ పడుచుగానూ కనపడినై. ఈ వింత చూచి తాతకు ఆశ్చర్యం కలిగింది. తన పశువులు పడుచువైనాయనే సంతోషంతో తనుకూడా మడుగులో దిగి స్నానం చేశాడు. స్నానం చేసి గట్టుపైకి వచ్చేసరికల్లా తాతకు ముసిలిరూపం పోయి, పడుచువాడయాడు.

సరీగా అదే సమయానికి ఆ ముసలివాని భార్య నెత్తిని కూటికుండ పెట్టుకుని ఆ దారిన పొలానికి పోతూవుంది. అలా పోతూవున్న ఆమెను అతడు పలుకరించేసరికి, ఎవడో తుంటరి తనతో సరాగాలాడుతున్నాడనుకొని, ఎదిరించి సమాధానం చెప్పసాగింది. "నేను నీ భర్తను, ఫలాన ముసిలివాడనే," అని ఎంత చెప్పినా ఆమె నమ్మకపోయేసరికి వాడు ఆమెను బరబర చెయి పట్టుకు లాగి మడుగులో ముంచాడు. ఏముంది? పైకి వచ్చేసరికల్లా ఆమె రూపవతి, యౌవనవతిఐ కూర్చుంది. తీరా ముసిలివాడూ అతని భార్యా కలిసి ఇంటికి వెళ్లేటప్పటికి, వాళ్ల బిడ్డలు తలిదండ్రుల్ని ఆనవాలు పట్టలేకపోయారు. తరువాత క్రమంగా నిజానిజాలు బయల్పడి పినాకిని జలమహిమ అందరకూ వెల్లడిఐంది. అప్పటినించీ ఆ మడుగులో స్నానం చేసి, ప్రజలు అమరత్వం పొందటం ప్రారంభమైంది.

కొద్దికాలానికల్లా ఈ వర్తమానం త్రిలోక సంచారి ఐనటువంటి నారదమహర్షి చెవుల బడింది. ఎవరికైనా మేలు జరుగుతూ వుంటే ఓర్వలేని నారదుడు, ఇంతమంది ప్రజలు అమరత్వం పొందుతూవుంటే చూచి సహించగలడా? — ఉహుఁ. కనుక, "ఈ మడుగుకి ఏవిధంగా కట్టడి చేయుటమా!" అని ఆలోచించి తిన్నగా బ్రహ్మదేమునివద్దకు వెళ్లి సంగతి సందర్భాలు చెప్పాడు.



'ఐతే, భూలోకంలో ఇటువంటి మడుగు ఎలా పుట్టిందీ?' అని దివ్యదృష్టితో చూచాడు బ్రహ్మ. పూర్వకాలమందు, తన తల్లి దాస్యవిముక్తికోసం దేవలోకంనించి గరుత్మంతుడు అమృతభాండాన్ని తీసుకు పోతూవుండగా దేవేంద్రుడు ఎదిరించాడు. అప్పుడు ఇద్దరి మధ్యనా ఘోరయుద్ధం జరిగింది. ఆ పోరాటంలో అమృతబిందువు ఒకటి చింది, భూలోకంలో ఇప్పుడు ఆ మడుగు ఉండే చోటున పడిఉండినట్టు గ్రహించాడు.

నారదుడు నూరిపోసినమీదట, అమరత్వం యిచ్చే ఇటువంటి మడుగు భూలోకంలో ఉండకూడదు అని బ్రహ్మకు కూడా అనిపించింది. వెంటనే బ్రహ్మ హనుమంతుని రప్పించి, "హనూ! ఒక పర్వతం తెచ్చి పడవేసి, పినాకినిలో ఉండే ఆ మడుగును కప్పెట్టివేసెయ్యి" అన్నాడు. చెప్పటమే తడవుగా ఆంజనేయుడు బ్రహ్మాండమైన పర్వతం ఒకటి తెచ్చి దభీమని ఆ మడుగులో పడవేశాడు. కాని, ఆ పినాకినీ జలమహిమ యేమిటో కాని, హనుమంతుడు పడవేసిన పర్వతం మడుగును కప్పివేయటానికి బదులు బెండు లాగా నీటిపైన తేలి ఆడుతూవుంది.

ఈ చిత్రం చూచి బ్రహ్మకు కంగారు పుట్టింది. అతనికేమీ తోచక నారదుణ్ణి

వెంటబెట్టుకుని, సరాసరి శివునివద్దకు వెళ్లాడు. శివునికికూడా ఈ విషయంలో ఏమీ పాలుపోక, ఆ ముగ్గురూ కలిసి వైకుంఠంలోవుండే విష్ణుమూర్తివద్దకుపోయి జరిగిన వైనాలన్నీ పూసగుచ్చినట్టు ఆ జగన్నాటక సూత్రధారుడికి వినికిడిచేశారు.

విష్ణుమూర్తి చిరునవ్వుతో అంతా విని, "నాకూ శివునికీ యెప్పుడూ ఇటువంటివే చిక్కులు తగులుతూవుంటై. తిన్నగా ఉండడుకదా ఈ నారదుడు!" అని చెప్పి, బ్రహ్మనూ నారదుణ్ణీ పంపివేశాడు. తరువాత శివకేశవులు మానవరూపంతో భూలోకానికి దిగివచ్చి, ఆ మడుగుపైన తేలి ఆడుతూవున్న పర్వతాన్ని ఒకవైపున శివుడూ, రెండోవైపున కేశవుడూ అదిమిపట్టి అణిచివేశారు.

అప్పుడు వారి ప్రభావంవల్ల ఆ పర్వతం భూమిపైన అణిగివుండి, మడుగు మూసుకపోయింది.

ఆ బ్రాహ్మాది అస్త్రులను పువ్వులుగా మార్చగల మహిమ గలిగింది పినాకినీ నదిజలం. అటువంటి నీటిలో అంజనేయుడు పర్వతంతెచ్చి పడవేశాడు. ఈ రెండు కారణాలవల్ల ఆ పర్వతానికి 'పుష్పగిరి' అనే పేరు వచ్చిందంటారు.

శివకేశవులు ఇద్దరూ దిగివచ్చి ఆ పర్వతాన్ని అణచటంచేత, కొండకు రెండు పక్కలా ఆ ఇద్దరి ఆలయాలూ వెలిసి, అది ఈనాడు ఒక దివ్యక్షేత్రమై ఉన్నది.

ఇక్కడ యేటా గొప్ప ఉత్సవాలు జరుగుతై. లక్షలాది జనం స్వాముల దర్శనానికి వస్తుంటారు. ఇది చెప్పదగిన పుణ్యక్షేత్రంగనకనే పుష్పగిరి స్వాములవారు ఇక్కడ మఠం ఏర్పరచుకొన్నారు.

పుష్పగిరి కడపకు పదిమైళ్ళ దూరంలోనే ఉన్నది కాబట్టి ఈ సారి మీరు ఆ ప్రాంతం వెళ్ళినప్పుడు తప్పక ఈ క్షేత్రం దర్శించి రండి!






లచ్చిరెడ్డిపాలెంలో పెదలక్కయ్యా, చినలక్కయ్యా అని ఇద్దరన్నదమ్ములుండేవారు. వాళ్ళిద్దరూ పేదవాళ్ళే. కట్టెలమోపులమ్ముకుని రోజూ చెరో పావలా సంపాదించుకునేవారు. పెదలక్కయ్య తన పావలాలో రెండణాలు సంసారంకోసం ఖర్చుపెట్టి, మిగతా రెండణాలూ నిలవేసుకునేవాడు. చినలక్కయ్య పెళ్ళే చేసుకోలేదు. ఎవడు పిల్లనిస్తానని వచ్చినా తాపీగా 'చేసుకుంటే నవాబు కూతుర్నే పెళ్లి చేసుకోవాలి!' అని అక్కడ నిలబడకుండా చక్కా పోయేవాడు. 'పావలాడబ్బులకు గతిలేని వీడా నవాబుకూతురును పెళ్లాడటం!' అని హేళన చేసేవాళ్లు అందరున్నూ.

చినలక్కయ్య సంపాదించే పావలాలో మూడణాలు పెట్టి చిల్లర తిండితిని, తక్కిన అణా చాకలికి ఇచ్చి వాడిదగ్గిర్నుంచి ఇస్త్రీ మడతలు అద్దెకు తెచ్చుకుని ధరించి, సాయంకాలం దర్జాగా వీధులమ్మట షికారు వెళ్లేవాడు. 'ఎవరయ్యా ఆ వచ్చేది?' అంటే 'ఎవరో తెలియదా? హైద్రాబాదు నవాబు గారి అల్లుడు చినలక్కయ్యగారు!' అనే సరికల్లా ఊళ్లో వాళ్లందరూ సరదాగా నవ్వుతూవుండేవాళ్లు.

ఒకమాటు పెద్ద ముసురుపట్టి, కట్టెల కోసం వెళ్లటానికి వీల్లేకపోయింది. చినలక్కయ్యకు నిలవ సొమ్ము లేకపోవటంచేత చేసేదిలేక ఒక రావిచెట్టుక్రింద వర్షానికి తడుస్తూ నిలబడ్డాడు. తొలినాటి రాత్రి వర్షానికి ఆ చెట్టు మొదట ఉన్న మెరకమట్టి చాలా మట్టుకు కొట్టుకుపోయింది. వాడు యాథాలాభంగా కాలిబొటనవ్రేలితో అక్కడ ఇంకాఉన్న మట్టిని మెటకరించబోయేటప్పటికి ఏదో వేలికి తగిలినట్టు అయింది. 'ఏమిటి చెప్మా?' అని అలానే కూచుని చేతులతో చుట్టూ ఉన్న మట్టి తీసే

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు.



సరికి ఒకబిందె, వరహాలూ కనపడినై. వాడు ఎగిరి గంతేస్తూ తిన్నగా చాకలివాడింటికి పరుగెత్తుకుపోయి రెండువరహాలు వాడికిచ్చి "ఒరే చాకలీ! ఈ బిందె తీసుకుపోయి, హైద్రాబాదు నవాబుగారి అమ్మాయికిచ్చి, 'లచ్చిరెడ్డిపాలెం చినలక్కయ్యగారు పంపేరు' అని చెప్పు. 'ఎందుకు' అంటే 'రవికలగుడ్డనిమిత్తం' అని చెప్పేసి చక్కారా" అన్నాడు. అప్రకారమే చేసి చక్కావచ్చాడు చాకలి.

హైద్రాబాదు నవాబుగారి కుమార్తె ఆ వరహాల బిందెను చూసి, 'రవికలగుడ్డ నిమిత్తమే ఇన్ని వరహాలు పంపిన ఈ చినలక్కయ్య ఎవడో కోటీశ్వరుడైయుండాలి' అనుకుంది. కానుక పంపినవాళ్లకి తిరిగి కానుక పంపటం మర్యాద గనక ఆమె నవాబుగారి సాలీలను రప్పించి, సన్నటి పట్టువస్త్రాలు నేసుకురమ్మంది. వాళ్లునేసిన ఆ సున్నితమైన వస్త్రాలన్నీ ఒక కాటుక్కాయ బరిణలో ఇమిడిపోయినై. ఆవిడ మెచ్చుకుని ఆ బరిణను చినలక్కయ్యకు కానుకగా పంపించింది.

అలాంటి విలువైన బట్టలు ధరించి షోకుగా షికారు వెళ్లటం చినలక్కయ్యకు సరదాయే. కాని వాడి వుద్దేశమే వేరు. ఆ దుస్తులు మళ్లీ చక్కగా మడతబెట్టి, బరిణలో పెట్టేసి, ఆ బరిణను ఈమాటు నవాబుగారికే పంపించాడు. ఈ దుస్తులు తమ సాలీలు నేసినవే అని నవాబుగారికి తెలియనే తెలీదు. వాటిని చూసి ఆయన మురిసిపోయి, ఈ చినలక్కయ్య ఎవడో నాకన్నా గొప్పవాడై ఉండాలి. లేకపోతే ఇలాంటి విలువైన దుస్తులు నేయించి నాకు పంపగలడా?' అనుకున్నాడు. ప్రతిగా ఎన్నో ఏనుగుల్నీ, లొట్టిపిట్టల్నీ రప్పించి, వాటిమీద వరహాల సంచులు కట్టించి, చినలక్కయ్యకి కానుక పంపేడు.



లచ్చిరెడ్డిపాలానికి ఏనుగులూ, లొట్టి పిట్టలూ రావటం, వెళ్లటం చూశారే కాని ఊళ్లో వాళ్లెవ్వరికీ జరిగిన సంగతేమిటో తెలియదు. ఏమంటే చినలక్కయ్య ఆ వచ్చిన సంచులు ఫలానా అని తెలుసుకుని వాటిని అపళంగానే నవాబు కూతురుకు కానుకగా పంపేశాడు! నవాబు కూతురుకు ఆ సొమ్ము చూసేటప్పటికి కళ్లు మిరుమిట్లు గొలిపి, వెంటనే ఆమె సపరివారంగా వచ్చి లచ్చిరెడ్డిపాలెం ఊరుబయట డేరాలో మకాం వేసింది.

తన్ను చూడటానికి నవాబు కూతురు వచ్చిందని తెలిసేటప్పటికి చినలక్కయ్యకి గాభరా ఎత్తి వాడు పక్కనున్న అడవిలోకి పారిపోయాడు. అక్కడ సరోవరంలో దేవ కన్యలు కొందరు కిరీటాలు గట్టుమీద పెట్టుకుని జలక్రీడ సల్పుతూ వున్నారు. చిన లక్కయ్య ఆ కిరీటాలన్నీ తీసి చెట్టెక్కి కూచున్నాడు. వాళ్లు 'నీవేమికోరుకుంటే అది ఇస్తాం. మా కిరీటాలిచ్చెయ్. ఇవి లేకుంటే మళ్లీ మా లోకానికి పోలేము నాయనా'అని బ్రతిమాలేరు.

వాడు "నాకేమీవద్దు. మీ బంగారుకలశలతో నీరు పట్టుకెళ్లి ఊరుబయట డేరాలో ఉండేనవాబుకూతురుకు కాళ్లుకడుక్కోమని ఇవ్వండి. 'మీ రెవరంటే, చినలక్కయ్యగారి పరిచారికలం' అనిచెప్పి వెళ్లిపొండి" అన్నాడు. వాళ్లు అందుకు ఒప్పుకోగా కిరీటాలిచ్చేశాడు. వాళ్లు చినలక్కయ్య చెప్పినట్లు తూ. చ. తప్పకుండా చేసి వెళ్లిపోయారు. నవాబు కూతురు ఆ దేవకన్యల్నీ ఆ బంగారు కలశాలనీ చూసి ఆశ్చర్యపోయి, 'అమ్మో, ఈ లక్కయ్య ఎవరో దేవగణానికి చెందినవాడుగాని సామాన్య మానవుడు కాడు. కాకపోతే దేవకన్యలేమిటి పరిచారకులుగా ఉండటమేమిటి! అనుకుంది. మళ్లీ ఆ దేవపురుషుడి దర్శనం

ఎన్నటికో అనే ఆత్రంతో ఆమె తెల్లవార కుండానే తన పట్టణం వెళ్లిపోయింది.

తమ ఊళ్లో దిగిన నవాబుగారి కుమార్తెను ఇంకా ఎప్పుడో వచ్చి సావకాశంగా దర్శనం చేద్దామనుకుంటూన్న లచ్చిరెడ్డిపాలెం ప్రజలకు ఆమె రాత్రికి రాత్రే వెళ్లిపోవటం ఆశాభంగం కలిగించింది. 'ఇదేమిట్రా చినలక్కయ్యా, మేం చూడకుండానే పంపేశావు ?' అని గోల పెట్టేరు. అప్పుడు వాడు, 'మీకు ఆవిణ్ణి చూడాలని అంత మనుసుగా ఉంటే రండి చూపెడతాను. నన్ను ఒక ముత్యాల పల్లకిలో కూచోబెట్టి, మీరంతా హైద్రాబాదుకు మోసుకెళ్ళాలి' అన్నాడు. 'ఓస్, ఇంతేగదా !' అని వాళ్లు నవాబుగారి కుమార్తెను చూడాలన్న సరదాకొద్దీ వప్పుకుని 'లచ్చిరెడ్డిపాలెం చినలక్కయ్యామహారాజులుంగారు వేంచేస్తున్నారు. తప్పుకోండో హొూయ్ !' అని ముందు టముకు వేసుకొంటూ మాంచి ముస్తాబు చేసుకున్న చినలక్కయ్యాను ముత్యాల పల్లకీలో మోసుకపోయారు.

ఆ టముకు విననడగానే అంతఃపురంలో ఉన్న నవాబుగారి కుమార్తె మేడమీదనుంచి తొంగి చూసి, మనసు నిలుపుకోలేక చరచరా కిందికి దిగివచ్చి, చినలక్కయ్యా మెడలో పూలహారం వేసి, పైకి తీసుకుపోయింది.

పల్లకీ దించి బుజాలు తడుముని చూసుకుంటూన్న లచ్చిరెడ్డిపాలెం ప్రజలు నవాబుగారి కుమార్తె రావటం, చినలక్కయ్యాను తీసుకుపోవటం కనిపెట్టనే లేకపోయారు! వాళ్లు తలకోవిధంగా చెప్పుకొంటూ అట్టె పైకి చూచేసరికి, అంతఃపురంలో నవాబుగారి కుమార్తె చుట్టిఇచ్చే తములపాకుల చిలకలు అందుకొంటున్న చిన్నలక్కయ్యా చిరునవ్వు నవ్వుతూ వాళ్లకు కనుపించాడు !






అగ్బరుచక్రవర్తి కాలమందు హస్తినా పురంలో తులసీదాసు అనే రామభక్తుడు ఉండేవాడు. ఆయన రోజూ సమీప గ్రామానికివెళ్లి అక్కడివాళ్లకి వాల్మీకి రామాయణం చదివి వినిపిస్తోండేవాడు. ఆయన గొప్ప పండితుడూ కవీ మహాభక్తుడున్నూ. అందువల్ల పురాణం చెప్పుతోంటే, గ్రామస్థులందరికీ రామాయణం కళ్లకి కట్టినట్టుండేది.

ఆ వినటానికి వచ్చేవాళ్లలో ముసిలి బ్రహ్మచారి ఒకాయన అందరికంటే ముందే హాజరయ్యేవాడు. ఆయన చాలీ చాలని చిరుగుల అంగవస్త్రంతో వచ్చి, ఎంతో భక్తిశ్రద్ధలతో వింటూ ఉండేవాడు.

తులసీదాసు అందరికీ వినపడేటట్లు కంఠం ఎత్తి శ్లోకాలు చదివి, అర్థం చెబుతూవుంటే మాటిమాటికీ గొంతుక ఆర్చుకుపోతూండేది. అటువంటప్పుడు ఆ ముసిలి బ్రహ్మచారి మంచినీరు తెచ్చి ఆయన లోటాలో పోసి, 'దాహం పుచ్చుకోండి బాబూ!' అని అంటూ ఉండేవాడు.

రోజూ రాత్రి పురాణం ఐపోవటంతోనే తులసీదాసు తన రామాయణ పుస్తకమూ, చెంబూ పుచ్చుకుని హస్తినాపురం వచ్చేస్తూ, చెంబులో మిగిలిన నీటిని దారిలో ఒక రావిచెట్టు మొదట్లో పోసి పోతూవుండటం మామూలు. ఇలా చాలా కాలం గడిచింది.

ఒకనాటిరాత్రి ఆయన మామూలు ప్రకారం ఆ చెట్టుమొదట నీళ్లు పోసి తన దారిని పోతూంటే, "అబ్బాయ్, అగు" అని ఎవరో అన్నట్టు వినిపించింది.

'మనుష్యసంచారంలేని ఈ ప్రదేశంలో ఎవరు చెప్మా పిలుస్త!' అని ఆశ్చర్యపోతూ తులసీదాసు నిలబడిపోయేసరికి బ్రహ్మరాక్షసుడొకడు చెట్టు దిగివచ్చి ఆయనకు ప్రత్యక్షమయాడు. వానిని చూచి తులసీదాసు భయపడేసరికి, 'నన్ను చూసి

సి. హరనాథ్, హైదరాబాదు



లనిపించి, వరం ఇస్తున్నాను' అనిచెప్పాడు బ్రహ్మరాక్షసుడు.

అందుకు తులసీదాసు, 'మహాత్మా, నాకు ఏ కోరికా లేదు. నేను రామభక్తుణ్ణి. చిర కాలమై రామాయణం పురాణం చెపుతూ, రామనామమే జపిస్తూ జీవితం గడుపు కొస్తున్నాను. కాని ఇంకా ఆ శ్రీరాముని దర్శనం కాలేదు. ఆయన దర్శనం కలిగే టట్లు అనుగ్రహిస్తే చాలు, అంతకంటె నాకు కావాల్సింది ఏమీ లేదు' అంటూ తన మనసులోని కోరిక వెల్లడించాడు.

నీవేమీ భయపడకు. నేనూ నీకుమల్లే ఒక పండితుణ్ణే. ఐతే దుర్మార్గంగా ప్రవర్తించి, సాధుజనుల్ని హింసించటంవల్ల ఈ ఘోర రూపం వచ్చింది. సరే, నా కథకేమిలే, నీకేం వరం కావాలో కోరుకో' అన్నాడు.

తులసీదాసు ఆశ్చర్యంతో, 'అయ్యో, ఎంతమాట! నాకే వరమూ వద్దు. కాని, నా మీద మీకీ దయ ఎందుకు పుట్టుకొచ్చిందో చెప్పండి, సంతోషిస్తాను' అన్నాడు.

'దయ ఊరికే పుట్టుకు రాలేదోయ్. దాహంతో పీక ఎండిపోతూవున్న నాకు రోజూ నువ్వు ఇన్ని నీళ్లు పోసి పోతున్నావు. ఈ ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యా

బ్రహ్మరాక్షసుడికి కాస్సేపటివరకూ నోట మాట రాలేదు. "అబ్బాయ్, నీవంటి మహాభక్తుడు కోరదగిన వరమే ఇది. కాని ఆ వరం సిద్ధింపచేసే శక్తి నాకు లేదు. అంతమాత్రాన నిరుత్సాహపడకు. నేను నీకు రామదర్శనం చేయించలేకపోయినా, చేయించగల మహానుభావుణ్ణి చూపెడ తాను. ఆయన్ని నువు రోజూ చూస్తూనే వున్నావుసుమా!' అన్నాడు.

'ఎవరు బాబూ ఆయన?' అని ఆత్రంతో అడిగాడు తులసీదాసు.

'నువ్వు పురాణం చెబుతూవుంటే రోజూ భక్తిశ్రద్ధలతో వచ్చి వింటూ మధ్య మధ్య

నీకు మంచినీరు తెచ్చి పోసే ఆ వృద్ధ బ్రహ్మచారి ఎవరని నీ ఉద్దేశం? రామ భక్తాగ్రేసరుడైన హనుమంతుడే ఆయన!' అని చెప్పాడు బ్రహ్మరాక్షసుడు.

ఈ మాట వినటంతోనే తులసీదాసు బ్రహ్మానందభరితుడై, ఆ బ్రహ్మరాక్షసుడి పాదాలు ముట్టుకుని సాష్టాంగ నమస్కారం చేశాడు. వెంటనే బ్రహ్మరాక్షసుడికి ఆ ఘోరరూపం పోయి, దివ్యమైన తేజస్సుతో ప్రకాశించే ఒక గంధర్వుడై నిలబడ్డాడు.

'మహాత్మా, నీ స్పర్శవల్ల నా పూర్వ రూపం వచ్చింది నాకు! నేనెంత అదృష్ట వంతుణ్ణి! నీ మేలు ఎన్నటికీ మరువను. కొద్దికాలంలోనే నీకు శ్రీరామ కటాక్షం కలుగుతుంది, నాకు సెలవియ్యి' అని వేనోళ్ల స్తోత్రంచేసి, అదృశ్యమయ్యాడు.

మరునాడు తులసీదాసు పురాణం చెబుతున్నా ధ్యాసమంతా మామూలుగా వచ్చి కూచుని వింటూన్న ఆ వృద్ధబ్రహ్మ చారిమీదనే ఉంది. త్వరగా ముగించేశాడు ఆరాత్రి. అందరూ వెళ్లిపోయారు. ముసిలి బ్రహ్మచారికూడా పోబోతూ, 'ఏం దాసూ, రాచకార్యం ఏదైనా వచ్చిందా, ముందుగా ముగించేశావు ఇవాళ?' అని అడిగాడు.



తులసీదాసు ఆయనకు పాదాక్రాంతుడై 'అన్నా! రాచకార్యమే ఉంది! నీకూ నాకూ ప్రభువైన ఆ శ్రీరామచంద్రుని దర్శనం నీవు నాకు చేయించాలి. నీ నిత్య దర్శనంతో ఇన్నాళ్ళూ నన్ను కటాక్షించావు. నువ్వు ఎంతచెబితే అంత రాముడికి! ఆయన్ని నాకు చూపించు' అని పరిపరి విధాల వేడుకున్నాడు.

ఆంజనేయుడు చిరునవ్వుతో 'ఏవేషం వేసినా నా సంగతి తెలిసిపోయిందే వీనికి' అనుకొని, 'సరే వెళ్లు. స్వామిదర్శనం ఔతుందిలే' అని చెప్పి అంతర్ధాన మయాడు.



'ఏమిటి సెలవు తల్లీ?' అని ఆత్రంతో అడిగాడు తులసీదాసు.

అందుకు సీతాదేవి 'తులసీదాసూ! వాల్మీకి రాసిన రామాయణం సంస్కృతంలో ఉంది. ఆ భాష ఇప్పుడు అందరికీ అర్థం కావటంలేదు. కనుక నువ్వు రామాయణాన్ని హిందీలోరాస్తే బాగుంటుందని మా వుద్దేశం' అనిఅనటం, ఆ దంపతులు అదృశ్యం కావటం, తులసీదాసుకి మెలకువ రావటం ఒక్కమాటుగా జరిగినై.

సీతారాముల ఆజ్ఞ తలదాల్చి, తులసీదాసు వెంటనే తాటాకులూ గంటమూతెచ్చి హిందీభాషలో రామాయణం రాయటం ఆరంభించాడు.

రామాయణంవంటి మహాగ్రంథం దీక్షగా రాయటానికి ప్రశాంతత అవసరమని తలచి, ఆ ఊరువదిలి తులసీదాసు సరాసరి కాశీలో మకాం పెట్టాడు. కాశీలో గొప్ప గొప్ప పండితు లెందరో ఉన్నారు. వాళ్లతో స్నేహంచేసి, తను రాసినంత వరకు ఏరోజు కారోజు చూపెట్టేవాడు. కొందరు, 'ఇలా అందరికీ అర్థమయేభాషలో రాసి లోకోపకారం చేస్తున్నావు తులసీదాసూ, ధన్యుడవోయ్!' అని మెచ్చుకున్నారు.

ఆరాత్రి తులసీదాసు ఇంటికివెళ్లి శ్రీరామచంద్రుణ్ణి ధ్యానిస్తూ కూర్చునేటప్పటికి చిన్న కునుకువచ్చింది. ఆ కునుకులో ఒక కలవచ్చి, ఆయనకు శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నులతో సహా ప్రత్యక్షమయాడు. తులసీదాసు ఆనందానికి మేరలేకపోయింది.

అలా ఎంతోసేపుగా నిలబడిపోయివున్న శ్రీరాముడు తులసీదాసుని 'ఏమోయ్, ఇంక నేను వెళ్లవచ్చునా?' అని ప్రశ్నించాడు.

ఈప్రశ్నకు సీతాదేవి 'ఏమండీ, ఇతనితో మనం చెప్పదలుచుకున్న మాట మరిచేపోయినట్టున్నారే!' అని జ్ఞాపకంచేసింది.

మరికొందరు 'రామాయణం సంస్కృతం లోనే ఉండాలి గాని మరొకభాషలో రాస్తే అపవిత్రం అయిపోతుంది!' అంటూ దూషించారు. ఏమైతేనేం, తులసీదాసుపేరు ప్రఖ్యాతులు దశదిశలా ఇట్టే వ్యాపించినై.




ఒకనాడు తులసీదాసు ఆశ్రమంలోకి ఒక స్త్రీవచ్చి ఆయనకు నమస్కరించింది. ఆయన తన వ్రాతధోరణిలో ఉండి 'దీర్ఘ సుమంగళీభవ! పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు!' అని ఆమెను దీవించి, మళ్ళీ తనమానాన తను రాసుకుంటున్నాడు.

ఆమె సంతోషించటానికి బదులు వెక్కి వెక్కి యేడవటం మొదలెట్టింది. ఆయన వంచిన తల యెత్తి 'ఏమితల్లీ, ఎందుకు దుఃఖిస్తున్నావ్?' అని అడిగేడు.

అందుకు ఆమె, 'స్వామీ, నాభర్త ఈ ఉదయమే మరణించాడు. శవాన్ని గంగ ఒడ్డుకి తీసుకెళ్ళేరు. నేను ఆయనతో సహ గమనం చెయ్యటానికి వెడుతూ మహాత్ము లైన మీకు నమస్కరించి పోదామని ఇలా వచ్చాను' అంది.

ఆయన నిర్ఘాంతపోయాడు. 'తల్లీ, శ్రీ రామచంద్రుడే నా నోటివెంట అలా పలి కించాడు. కనుక నీవు అదృష్టవంతురాల వన్నమాట. రాము డెన్నడూ ఆడితప్పలేదు. నా నోట ఆయన పలికించిన ఈమాటలు కూడా అబద్ధం కావటానికి వీలులేదు. నీవు గంగఒడ్డుకి పోయి, శవాన్ని ఇక్కడకు రప్పించు చూదాం' అన్నాడు.

ఆమె గబగబా పరుగెత్తుకెళ్ళి, భర్త శవాన్ని వెంటబెట్టుకు వచ్చింది.

తులసీదాసు శ్రీ రాముణ్ణి ధ్యానించి, 'స్వామీ, బండరాయిని లావణ్యవతిగా మార్చిన మహానుభావుడవు. నీకు అసాధ్య మేమున్నది? ఈయనను పునరుజ్జీవితుని చేసి, నామాట నిలబెట్టు తండ్రీ!' అంటూ ప్రార్థించాడు.



అతడలా ప్రార్థించుతూ వుండగానే ఆ శవం నిద్రలోంచి మేలుకున్నవాడికిమల్లే లేచి కూర్చొనేసరికి ఆ స్త్రీ చెప్పలేని ఆనందంతో పరిపరివిధాల తులసీదాసుకి కృతజ్ఞత కనపరుస్తూ వెళ్లిపోయింది.

ఈ సంగతి అక్బరుచక్రవర్తికికూడా తెలిసి ఆయన దర్బారులో పండితుల యెదట తులసీదాసు మహాత్మ్యాన్నిగురించి మెచ్చుకోసాగాడు.

తులసీదాసంటే కిట్టని ఆ పండితులు "ప్రభూ! ఆయనకు మహత్యంలేదు ఏమీ లేదు. అంతా ఉత్తది. పైగా యిప్పుడు సంస్కృత రామాయణాన్ని హిందీలోరాసి అపవిత్రంకూడా చేస్తున్నాడు. దీనివల్ల దేశానికి ఏమిఉపద్రవం వస్తుందో యేమో!" అంటూ అసూయ వెలిగక్కారు.

వెంటనే పాదుషా తులసీదాసుని రప్పించి 'ఏమిటయ్యా నువ్వు కాశీలో ఏదో గమ్మత్తులు చేస్తున్నావుట! చచ్చిన వాణ్ణి బ్రతికించావుట నిజమేనా?' అని గద్దించి అడిగేడు.

తులసీదాసు, 'అయ్యా, నేను కాదు. శ్రీరామచంద్రుడే బ్రతికించాడు' అన్నాడు.

'శ్రీరామచంద్రుడా? ఏడీ, అతణ్ణి నాకు చూపించు. చూపలేక బూటకంమాటలు చెప్పావంటే శిక్ష వేయిస్తాసుమా' అని బెదిరించాడు పాదుషా.

తులసీదాసు ఏమో చెప్పబోతూంటే వినిపించుకోక పాదుషా భటుల్ని పిలిచి, 'ఆ రామచంద్రుడెవరో నాకు చూపేవరకూ ఇతనిని ఎక్కడికీ కదలనివ్వవద్దు' అని ఆజ్ఞాపించి వెళ్లిపోయాడు.

కాస్సేపటికి వృద్ధబ్రహ్మచారివేషంలో హనుమంతుడు అక్కడికివచ్చి, కూడా తెచ్చిన తాటాకులూ గంటం అయ్యనకిచ్చి, 'దాసూ, నువ్వేం బాధపడక, నీ రామాయణం రాసుకుంటూ కూచో. పాదుషా పని

నే చూస్తానులే!' అని ధైర్యంచెప్పి వెళ్లిపోయాడు.

తెల్లవారేసరికల్లా పాదుషా పట్టణమంతా ఎక్కడ చూసినా కోతులతోటీ కొండ ముచ్చులతోటీ నిండిపోయింది! ఏయింటిమీద చూసినా ఒక్క పెంకుకూడా లేదు! ఏ చెట్టుని చూసినా ఒక్క కాయకూడా మిగలలేదు. వీధులమ్మట వెళ్లేవాళ్లని ఒక్కొక్కళ్లనే పట్టుకుని పీకి వదలిపెట్టేయి కోతులు! ఎవరేమి ఎక్కడ పెట్టుకున్నా ఉండనియ్యక ఎత్తుకుపోయాయి. ఎక్కడ నలుగురు చేరినా వాళ్లమీద ఏకొండముచ్చో దభీమని ఉరికి హడలగొట్టేది. ఆ నాడు ఉదయం పాదుషా అంతఃపురంలోనూ కోతులే! నాలుగు మహావానరాలు వచ్చి, ఆయన పడుకున్న మంచాన్ని మోసుకుపోయి, దొడ్లో ఉబ్బెత్తుగా పడవేశాయి! ఆయనకి మెలకువ వచ్చి చూసుకునేటప్పటికి ఏముంది? ఎక్కడ చూసినా కోతులమయమే! ఎవరిని చూసినా రక్కులూ రక్తమే!

ఏమిటిదంతా? అని వాకబుచేసేసరికి, మంత్రివచ్చి, 'ప్రభూ, సాధురూపుడైన తులసీదాసుని నిర్బంధించినందుకు



శ్రీరామచంద్రుడు కోపగించి ఈ కోతుల మూకని పంపాడేమో అని నాకు తోస్తుంది' అన్నాడు.

అక్బరు చక్రవర్తి యెకాయెకీని తులసీదాసు ఉన్నచోటికి వెళ్లి, 'మహాత్మా, నావల్ల అపరాధం జరిగింది. ఈ కోతుల్ని ఎక్కణ్ణుంచి రప్పించావో అక్కడికి పంపెయ్యి' అని పరిపరివిధాల ప్రాధేయపడ్డాడు.

తులసీదాసుకి కోతులొచ్చాయన్నసంగతే తెలీదు. ఏమంటే ఆయన తన వ్రాత ధోరణిలో ఉన్నాడు. అంతేకాకుండా కోతులు ఆ దరికి రాలేదు. 'కోతు లేమిటి!' అంటూ ఆయన బయటకొచ్చి చూచేటప్పటికి,

వానరసేన అంతా బుద్ధిమంతులకు మల్లే తలలు వంచుకుని కూర్చునివుంది!

ఆనందభరితుడైన తులసీదాసు అక్బరుతో «ప్రభూ, నీవెంత అదృష్టవంతుడవయ్యా! శ్రీరామచంద్రుని దర్శనం నీకు కాబోతోంది! వారిరాకను తెలుపుతూ ఈ కోతులు వచ్చాయి...శ్రీరామచంద్రుడికి ఇలాంటిసేనలు డెబ్భైరెండున్నాయి. అందులో ఇప్పుడు ఒక్కటే వచ్చింది. ఆ డెబ్భైరెండూ వచ్చినపిమ్మట, శ్రీరాములవారు సీతాదేవినీ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల్నీ, హనుమంతుణ్ణీ, సుగ్రీవ, విభీషణుల్నీ వెంటబెట్టుకుని వస్తారు! ఏచక్రవర్తికీ పట్టని అదృష్టం పట్టింది నీకు!' అంటూ, పాదుషానిమిత్తాన తనకు కూడా శ్రీరామదర్శనం కలుగబోతుందన్న సంతోషంతో పొంగిపోయాడు.

అక్బరుమాత్రం హడలిపోయాడు! ఒక్క సేనవల్లనే ఇంత అల్లకల్లోలం జరిగిందే, మిగతా డెబ్భైయొక్క వానరసేనలువస్తే ఇంకేమైనా ఉందా? అని ఆయన భయం.

పాదుషా తులసీదాసు కాళ్లమీదపడి, «మహాత్మా, ఆ సేనలూ వద్దు, రాముడూ రావద్దు? ఈ కోతుల్ని పొమ్మను, నీకు పుణ్యం ఉంటుంది!' అని గోలపెట్టేడు.

తులసీదాసు హనుమంతుణ్ణి తలుచుకునేసరికి కోతులూ, కొండముచ్చులూ ఎక్కడివక్కడ మాయమయాయి.

పాదుషా నాటినించీ సాధువులను బాధించకూడదని నిశ్చయించుకొని, తులసీదాసుని అనేకవిధాల సత్కరించి, సురక్షితంగా మళ్లీ కాశీకి పంపేశాడు.

మరికొంతకాలానికి తులసీదాసు తన హిందీరామాయణాన్ని పూర్తిచేసి జన్మ చాలించి శ్రీరామునిలో ఐక్యమయ్యాడు. ఆయన దేశానికి అర్పించి వెళ్లిన హిందీ రామాయణంవల్ల తులసీదాసు కీర్తి శాశ్వతంగా ఉండిపోయింది.






వైకుంఠరావు కాశీ ప్రయాణం చెయ్యటం యిదే మొదటిసారి. రైలు మదరాసు స్టేషను విడిచిన దగ్గిరనుంచీ ఆయనకు ఒకటే ఆలోచన—'కాశీలో ఎక్కడ బస చెయ్యటమా?' అని. తోటి ప్రయాణికులలో కాశీ దాకా వచ్చేవాళ్లు ఒక్కరూ కనబడలేదు.

మొగల్ సరాయి స్టేషనులో ఒకతను వైకుంఠరావుకు తోడుదొరికాడు. "మీ రేమీ కంగారుపడకండి. మీ మదరాసు అతనే ఒక అతను బస ఏర్పాటు చేశాడు. మిమ్మల్ని అక్కడ దిగవిడుస్తాను" అన్నాడు అతను.

కాశీస్టేషను చేరుకున్నాక ఆ స్నేహితుడు టాక్సీ మాట్లాడగా, అందులో వారు బయలుదేరారు. మరికొంచెం సేపటిలో టాక్సీ ఒక పెద్ద మేడముందు ఆగింది. ఆ స్నేహితుడు "ఇదేనండి నేను చెప్పిన బస. మీరు నేరుగా లోపలికి వెళ్లవచ్చు. మరి నేను సెలవు తీసుకుంటాను" అన్నాడు.

వైకుంఠరావు "ఇది టాక్సీ వానికివ్వండి" అంటూ ఒక అయిదురూపాయల నోటు ఇవ్వబోయాడు. ఆ స్నేహితుడు పుచ్చుకోకుండానే టాక్సీ ఎక్కి వెళ్లిపోయాడు.

తలవని తలంపుగా ఈ కొత్త వూరిలో తనకు యిలా సహాయపడిన ఆ అపరిచిత స్నేహితుణ్ణి మనసులో మెచ్చుకుంటూ, తన పెట్టీ బెడ్డింగూ తీసుకుని ఇంటిలో అడుగుపెట్టేసరికి, ఋషిలాంటి ఒకాయన "దయచేయండి, దయచేయండి" అంటూ ఎదురువచ్చి లోపలికి తీసుకుపోయాడు.

వైకుంఠరావు, తను ఎక్కడినుంచి వచ్చినదీ, తనకు సహాయపడిన ఆ అపరిచిత స్నేహితుని సంగతీ అంతా వివరంగా తెలియజేస్తూ, "ఇంతకూ తమ పేరు అడగటం మరిచానే" అన్నాడు.

'నా అసలు పేరు రామనాథం. కాని ఎక్కువమంది నన్ను 'లోకోపకారి' అని

నేరెళ్ల శ్రీధరదత్తు, మదనపల్లి



పిలుస్తుంటారు. నేనూ మద్రాసువాడినే కనుక మనవాళ్లంటే వుండే అభిమానంకొద్దీ నాకు చేతనైన సహాయం చేస్తుంటాను. ఇంతమాత్రానికే ఉప్పొంగిపోయి మనవాళ్లు నన్ను 'లోకోపకారి' అంటారు'' అనిచెప్పాడు.

అ తర్వాత లోకోపకారి, వైకుంఠరావుకి విశాలమైన ఒక గది చూపించి "మీ సామాను ఈ గదిలో వేసుకోండి" అన్నాడు.

వైకుంఠరావు, "మరైతే తాళంకూడా" అనబోయేసరికి లోకోపకారి పకపకా నవ్వి "క్షమించండి. తాళాలతో నాకు పనిలేదు. వీధివాకిలిదగ్గరనుంచీ అన్ని తలుపులూ తీసేవుంచుతాను. అయినా ఒక్క పూచిక పుల్లకూడా పోదు. పోనివ్వండి. సాయంత్రం అలా వూళ్లోకి వెళ్లినప్పుడు ఒక తాళం కొనుక్కొందురుగాని. అంతవరకూ మీ పెట్టె తాళం గదికి వేసుకోండి" అన్నాడు.

తర్వాత వాళ్లు భోజనాలన్నీ ముగించుకుని విశ్రాంతి తీసుకున్నారు. కాస్త చల్లబడినతర్వాత యిద్దరూ కలిసి వూళ్ళోకి బయలుదేరారు. వైకుంఠరావు తన పెట్టె తాళం తీసి గదికి వేసుకున్నాడు. కాని లోకోపకారి మాత్రం అన్ని తలుపులూ బార్లగా తెరిచివుంచే బయలుదేరాడు.

తర్వాత వాళ్ళు వూళ్ళో వింతలూ విశేషాలూ చూచుకుని, చివరికి ఒక తాళాల అంగడికి వెళ్ళారు. మంచి గట్టి తాళం ఒకటి చూచి కొన్నాడు వైకుంఠరావు. చీకటి పడే వేళకు తిరిగి యిల్లు చేరుకున్నారు.

ఎక్కడ ఉంచివెళ్ళిన వస్తువులు అక్కడనే వుండటం చూచి లోకోపకారి చెప్పింది నిజమని తోచింది వైకుంఠరావుకి.

తన అతిథికి అన్ని సౌకర్యాలు కలిగిస్తూ వున్నాడు లోకోపకారి. పైగా, వైకుంఠరావు చేతిడబ్బు ఒక్క దమ్మిడి అయినా ఖర్చు కాకుండా అన్ని ఖర్చులూ తనే భరిస్తున్నాడు. ఇందుకు వైకుంఠరావు ఉప్పొంగిపోయాడు.




ఇక రేపు తిరిగి యింటికి బయలుదేరుతా మనగా వైకుంఠరావు "స్వామీ. మీ మేలు మరువలేను. మీరు చూపిన ఆదరానికీ, చేసిన సహాయానికీ ఎంత యిస్తే..." అని యింకా ఏమో అనబోతుండగా—

లోకోపకారి, "ఏమిటీ! డబ్బు యివ్వ దలిచారా ? అంటే మీ డబ్బుకోసం యిలా సేవ చేస్తున్నాననుకున్నారన్నమాట !! క్షమించండి. నేను అలాంటివాణ్ణి కాను. మీది ఒక్క దమ్మిడీ నాకు వద్దు. కేవలం లోకోపకారమే నా జీవితాశయం" అన్నాడు.

వైకుంఠరావు "మన్నించండి. వారం రోజులు మీతో వుండికూడా మిమ్మల్ని అర్థం చేసుకోలేక, మీ మనస్సు నొప్పించాను. కాని ఒక్క వంద రూపాయలైనా తమరు అంగీకరించాలి. దీన్ని లోకోపకారానికే వినియోగించండి" అన్నాడు ఎంతోవినయంగా.

"సరే, దాంట్లో వెయ్యండి" అంటూ లోకోపకారి ఒక డిబ్బెంవైపు చూపాడు. వైకుంఠరావు ఒక నూరు రూపాయల నోటు దానిలో వేశాడు.

ఆ సాయంత్రం వాళ్లిద్దరూ వూళ్లోకివెళ్ళి చివరిసారిగా మళ్లీ విశ్వేశ్వరుని దర్శించుకుని చీకటిపడే వేళకు యింటికి తిరిగి వచ్చారు. వైకుంఠరావు గది తలుపు తెరిచి చూచేసరికి ఏముంది ? తన పెట్టె తెరిచి వుంది. గుడ్డలు అన్నీ చెక్కుచెదరకుండా వున్నవి కాని, పైకం ఒక్క దమ్మిడి ఐనా లేదు. ఇంతలో లోకోపకారికూడా అక్కడకు వచ్చి, "మీసామానంతా వుందా?" అన్నాడు.

"ఆ,సామానువున్నది. కాని పెట్టెలో పైకం పోయింది. చిత్రమేమిటంటే గది తాళం వేసింది వేసినట్లుగానేవుంది" అన్నాడు.

"ఏమిటీ! వేసిన తాళం వేసినట్టే వున్నదా ? ఆ దుర్మార్గులెవరో వంటయింట్లో వంట కుండలుకూడా పగలగొట్టి పోయారు. యింతకాలంగా ఈ యింట్లో ఉంటున్నాను

కాని ఎన్నడూ ఒక్క పూచికపుల్ల పోయి ఎరగను. నాసామాను పోయినందుకు నేను విచారించటం లేదు. ఇదంతా నాదికనుకనా. లోకులదేకదా? మీ విషయమే చాలా విచారంగా వుంది నాకు" అన్నాడు.

"ఏం చేస్తాం లెండి! ఇంతకూ నేను దురదృష్టవంతుణ్ణి. నా మూలకంగా మీ సామాను పోయింది. ఏమిటి చెయ్యటం? పోలీసు రిపోర్టిస్తే?" అన్నాడు వైకుంఠరావు.

"మీ భ్రమగాని, పోయిన సొమ్ము మళ్లీ దొరుకుతుందటండీ. రిపోర్టు యివ్వటానికేం ఈ క్షణం యిచ్చి రావచ్చు. కాని అదంతా వృధా ప్రయాస. నామటుకు నేను రిపోర్టు యివ్వను. ఎందుచేతనంటే అది నాసొమ్ము కాదుగదా?—పోతే, మీరు తిరిగి యిల్లు చేరుకోవటం అంటారా. దిబ్బెంలో మీరు వేసిన పైకం తీసుకోండి" అంటూ లోకోపకారి దిబ్బెంలోంచి ఆ నూరురూపాయల నోటు తీసి యివ్వబోయాడు.

వైకుంఠరావు అడ్డుపడి, "అంతావద్దు. రైలుచార్జీ యిప్పించండి చాలు" అన్నాడు.

"మీయిష్టం" అని లోకోపకారి నలభై రూపాయలు మాత్రంతీసి వైకుంఠరావుకిచ్చి ఆ రాత్రికిరాత్రే ప్రయాణంచేసి పంపాడు.

* * *

ఒక ఏడాది గడిచింది. ఒకనాటి వుదయం వైకుంఠరావు పత్రిక చదువుతుండగా ఒక వార్త కనుపించింది. "కాశీయాత్రకు వచ్చే యాత్రికులను మోసపుచ్చుతూ వచ్చిన 'లోకోపకారి' ముఠా అరెస్టు. 'లోకోపకారి'కి మూడేళ్ల కఠినశిక్ష" అని వుంది. ప్రకటన పూర్తిగా చదివినతర్వాత, మొగల్‌సరాయిలో తనకు పరిచయం కలిగిన ఆ స్నేహితుడూ, తాళాల అంగడివాడూ, మరికొందరూ, ఒక ముఠా అనీ, ఆ ముఠాకంతకూ 'లోకోపకారి' నాయకుడనీ, వైకుంఠరావు గ్రహించి చెప్పగా, ఇది చదువుకుని యింటిల్లిపాదీ తెగనవ్వుకున్నారు.






బుద్ధభగవానుడు అవతరించిన కాలంలో సవరుడనే వేటకాడు ఒకడు ఉండేవాడు. వాడికి విల్లువంచి కొట్టగల జబ్బపుష్టి, గురి తప్పకుండా వెయ్యగల నిశితదృష్టీ, ఉన్నాయి. వీటికితోడు 'నావంటి వేటగాడీ పధ్నాలుగు లోకాలలోనూ ఉంటడా' అనే గర్వంకూడా ఉండేది వాడికి. తెల్లవారింది మొదలు ప్రొద్దుగ్రుంకేవరకూ జంతువుల్ని వేటాడి చంపటమే వాడి పని. 'ఆ వేటంతా మాంసంకోసమేనా?' అంటే కాదు. బాణం దెబ్బతగిలి పడిపోయిన జంతువు విలవిల తన్నుకు చస్తూంటే, అలా చూస్తూ నిలపడడమే వాడికి ఆనందం.

కరుణామయుడైన బుద్ధభగవానుడు, వాడికి బుద్ధిచెప్పాలని తలచాడు.

మీరూ నేనూ ఐతే సవరుడితో. 'ఒరేయ్ అబ్బీ, ఏమిట్రా ఈపని?' అని మందలించబోతాం. బుద్ధదేవుడి పద్ధతి అదికాదు. ఎవడు ఏ తప్పుచేసినా, 'ఇది తప్పు' అని వాడంతట వానికే తెలిసివచ్చేట్టు చేసేవాడు.

ఒకనాడు సవరుడు యథాప్రకారం అరణ్యంలోకి వచ్చేసరికి ఆయన కూడా సరిగ్గా సవరుడికిమల్లేనే తయారైవచ్చి వాడికి ఎదురయాడు. సవరుడు, 'ఎవరవయ్యా నువ్వు?' అని గద్దించి అడిగేడు.

'నేనూ ఒక వేటగాణ్ణే. నా పేరు సవరుడు' అన్నాడు బుద్ధుడు.

ఈమాట వినేసరికి అసలు సవరుడికి కోపంతోబాటు విడ్డూరంకూడా తోచింది. 'నా అడవిలో ప్రవేశించటమే కాకుండా, నా పేరుకూడా పెట్టుకున్నాడే!' అనుకొంటూ, "ఊరికే విగ్రహపుష్టి ఉంటే సరా? నాకున్న చాకచక్యం, నేర్పు ఉండాలి. నేను ఎంత వేగంగా పరుగెత్తే లేడినైనా ఒక్క బాణంతో గురితప్పకుండా కొట్టగలను. నువ్వు కొట్టగలవా?" అన్నాడు.

పి. సౌభాగ్యలక్ష్మి, విజయనగరం




కొత్త వేటగాడు చిరునవ్వుతో "ఒక్క లేడినే కాదు; ఒక్కదెబ్బకు వందలకొద్దీ లేళ్లను కొట్టగలను, అన్నాడు.

'కోతలు కొయ్యకు కోయరాజా" అని పకపకా నవ్వటం మొదలేట్టేడు సవరుడు.

'కోతలు గాదు. చేతలే. చూద్దుగాని రా' అని, కూడా తీసుకుపోయాడు. వాళ్లిద్దరూ పదిబారలు నడిచారో లేదో దూరాన లేళ్ల గుంపు ఒకటి కనుపించింది. ముప్ఫయి యేళ్లనుంచి అడవిలో తిరుగుతున్నా ఎన్నడూ అన్ని లేళ్లు ఒక్కమాటుగా కనపడలేదు అసలు సవరుడికి. అందుచేత 'ఎన్ని లేళ్లో! పందకిపైనే ఉంటాయి' అన్నాడు.

అప్పుడు కొత్తవేటగాడు, 'లేనిపోని ఊహలెందుకు? వాటి నన్నిటినీ నేను నా బాణంతో పడగొడ్తాను, నువ్వు వెళ్ళి లెక్క పెడుదుగాని' అన్నాడు. అంటూనే ఒక బాణంతో లేళ్లమందను గురిపెట్టి కొట్టేడు. ఆ బాణం మనోవేగంతో వెళ్లి, ఒకదానిపక్క నొకటి పరుగెత్తి పోతూన్న ఆ లేళ్ల కంఠాల లోంచి దూసుకుపోయి, లేళ్లన్నీ తమల పాకులమోదలకుమల్లే ఒక్కసారిగా నేల పైకి ఒరిగిపోయాయి!

అప్పుడు భగవానుడు "వెళ్లవోయ్ వెళ్లు. ఎన్నిలేళ్లు పడ్డాయో లెక్కపెట్టిరా. వచ్చేటప్పుడు ఒక్కదాన్ని తెచ్చుకో. నీకూ, నీ సంసారానికీకూడా నాలుగు రోజుల విందుకు సరిపడుతుంది" అన్నాడు.

సవరుడు వెళ్లి, పడివున్న లేళ్లను లెక్క పెట్టేడు. సరిగ్గా ఐదువందల లేళ్లు ఉన్నాయి. "ఒక్క బాణంతో ఐదువందల్ని పడేశాడు! ఈయనెవరో మాయగాడు గాని సామాన్యపు వేటకాడు మాత్రం కాదు" అనుకుంటూ సవరుడు వాటిల్లో ఒకదాన్ని ఎత్తబోయాడు. కాని దాన్ని వాడు ఎత్తనేలేక పోయాడు! ఏనుగునైనా అవలీలగా ఎత్త గల బలం సవరుడిది. ఆ ఒక్క లేడినే




ఎత్తలేకపోయాడంటే చిత్రంగాక, మరి ఏమిటి? 'మరొక లేడిని ఎత్తుదాం' అని ప్రయత్నించాడు. కాని, ఏ లేడిని కదిపినా అంత బరువుగానూ ఉండి, వాడు ఎత్తలేక ఉత్తచేతులతో తిరిగి రావలసివచ్చింది.

వస్తూనే సవరుడు కొత్త వేటకాని పాదాలపై పడి "మీరెవరో అసామాన్యులుగా ఉన్నారు. దెబ్బకి ఐదువందల జంతువుల్ని ఎలా పడగొట్టగలిగారు? ఈ కిటుకు నాకు చెప్పరా?" అని బ్రతిమాలేడు.

బుద్ధభగవానుడు, "ఈ వేట కిటుకు తెలుసుకోవాలంటే నువ్వు అధమం ఒక నెల రోజులైనా మాంసం ముట్టకూడదు. పళ్లూ ఫలాలే తినాలి. ప్రాణహింస తలపెట్టకూడదు. ఇలా దీక్షగా ఒక్కనెల గడపగలిగితే అప్పుడు నేను వచ్చి నీకు ఈ రహస్యం చెపుతాను" అన్నాడు.

సవరుడు 'సరే' నన్నాడు. 'నెలా అయాక వస్తాన' ని చెప్పి మాయవేటకాడు వెళ్లిపోయాడు.

మొదట్నించీ మాంసం అలవాటైన సవరుడికి, అది మానెయ్యటం అంటే కొద్ది రోజులు కష్టమే అనిపించింది. చిన్నప్పటి నుంచీ వేట అలవాటైనవాడికి విల్లమ్ములు చిలక్కొయ్యకు తగిలించటంతోనే ఏమీ తోచేదికాదు. కాని ఒక మర్మాన్ని సాధించాలని దీక్ష పూనాడు గనక విల్లు పట్టకుండా మాంసం ముట్టకుండా వ్రతాన్ని కాపాడుకుంటూ వచ్చాడు. క్రమేణ ఇది అలవాటై మాంసం తినకపోతే గడవకపోదన్న సంగతి తెలిసివచ్చింది. 'ఆహారంకోసమని ఒక జంతువు ప్రాణాన్ని నిలువునా తీసెయ్యటమేమిటి?' అని తోచింది. ఇటువంటి ఆలోచనలోపడ్డ సవరుడికి ఇదివరలో తాను వినోదానికని బాణాలతో కొట్టిన జంతువులన్నీ విలవిల కొట్టుకుంటూ ఒక్కమాటుగా కళ్లయెదుట ప్రత్యక్షమయాయి. 'నోరులేని ఈ

జీవాలను నేను ఎందుకు చంపినట్టు? నా వినోదం నాశనంగానూ' అనిపించి, ప్రాణు లంటే కొత్తగా గౌరవం యేర్పడి కిరాతు డైన సవరుడు పరమసాధువుగా మారేడు.

గడువునాటికి బుద్ధభగవానుడు మళ్లీ వేటకాని రూపంలో వచ్చి, 'సవరా, ఆ కిటుకు చెప్పమన్నావా?' అన్నాడు.

సవరుడు వణికిపోతూ, 'వద్దు బాబూ, వద్దు. దెబ్బకొక ప్రాణం చొప్పున ఎన్నో ప్రాణాలు తీసి ఎంతో పాపం సంపా దించాను. నీ కిటుకు నేర్చుకుని, దెబ్బకి ఐదువందలుచొప్పున చంపి ఇంకా నర కంలో పడిపొమ్మంటావా?' అంటూ, పశ్చాత్తాపం వెల్లడించాడు.

అప్పుడు బుద్ధభగవానుడు తన నిజ రూపంలో ప్రత్యక్షమై 'సవరా! విచారించకు. ఈ దీక్షతోనే కడవరకూ ఉండు' అన్నాడు.

సవరుడు భగవానుని పాదాలపై బడి, 'స్వామీ, నాలో జీవకారుణ్యం కలిగించ టానికి మీరు వేటకానిరూపంలో వచ్చారన్న సంగతి ఆ రోజున తెలుసుకోలేకపోయాను. ప్రభూ! నాకొక్క మాట చెప్పండి. ఆ రోజున తమరు ఒక్క బాణంతో ఐదువందల లేళ్లని పడగొట్టారు. నేను ఎంతో బలం ఉండికూడా ఒక్కదానినైనా ఎత్తలేక పోయాను ఎందుచేత?' అని అడిగేడు.

భగవానుడు, "నాయనా! ఇదీ ఒక ప్రశ్నయేనా? ఎన్ని ప్రాణులనైనా పడగొట్ట గలం గాని ఒక్కదాన్నైనా లేవదియ్యు లేము. ఈ సంగతి నీకు తెలియటానికే ఆ నాడు వాటి బరువు తెలిసేటట్టు చేశాను. ఎన్ని ప్రాణాలైనా తియ్యవచ్చుగాని ఒక్క ప్రాణంకూడా పొయ్యలేము సవరా! ప్రాణం పొయ్యటానికి శక్తిలేని మనకు ప్రాణం తీయుటానికి హక్కు ఎక్కడిది? కనుకనే జీవహింస చేయుటం మహాపాపమని పెద్దలు చెబుతారు" అంటూ సవరుడికి మోక్షమార్గం చూపి అంతర్థానమయ్యాడు.



# ఎందుకో తెలుసా?

## జిరాఫీ మెడ పొడుగ్గా వుంటుంది



CHITRA

పూర్వకాలమందు ఖడ్గమృగమూ జిరాఫీ చాలా దోస్తిగా ఉండేవి. ఒకరోజున అవి మైదానంలో మేస్తూవుండగా, ఖడ్గమృగం ఇలా అన్నది: "నేస్తం! నేస్తం!! మనం బొత్తిగా పొట్టిగావున్న కారణంచేత అడ్డమైన జంతువులూ కాళ్లతో తొక్కే ఈ పసిరికనే మేయవలసిన కర్మం పట్టింది. మనకే పొడవుపాటి మెడ ఉన్నట్టయితే చెట్లపై నుండే పరిశుభ్రమైన చిగురుటాకులు ఎప్పటికప్పుడు తాజాగా తుంపుకొని తినవచ్చుకదా!" అని.

ఇందుకు జిరాఫీ "మనం ఇలా ఉండాలని దేవుడే వుద్దేశించినప్పుడు ఇక చేయగలదేముంది, అనుభవించటం తప్ప" అని వేదాంతపరంగా మాటాడింది.

అప్పుడు ఖడ్గమృగం బాగా ఆలోచించి, "నేస్తం!—నాకొక చక్కటి ఉపాయం తోస్తున్నది. ఏమిటీ అంటే: దేముణ్ణికూడా ధిక్కరించగల బుద్ధిబలం కలిగిన మానవుడున్నాడు. వాని శక్తికి మించిన శక్తి లేనే లేదు. కనుక, పోయి అతన్ని ఆశ్రయిస్తే తగిన ఆలోచన చెబుతాడు" అని చెప్పింది.

ఆ ప్రకారం రెండూ కలిసి మానవుని వద్దకు వెళ్లి, తమ కోరికను వెల్లడించినై. మానవుడు అవి చెప్పినదంతా విని, వాటికి ఉపకారం చేయటానికి వప్పుకొన్నాడు. "మీరిద్దరూ ఫలానా సప్తమీ బుధవారం రోజున తెల్లవారగట్ల మూడు గంటలకల్లా రండి, మీ కోరిక నెరవేరుస్తాను. ఐతే, నేను పెట్టిన సుముహూర్తం ఒక్క లిప్త కూడా తప్పటానికి వీల్లేదు. ఈ విషయంలో నేను చాలా కచ్చితంగా వుంటా సుమండీ' అని నిష్కర్షగా చెప్పాడు.

"ఆఁ దానికేముంది! వేళకు రావడమనేది అదొక పెద్ద కష్టమా" అనుకుని, అవి "అలాగే వస్తాము" అనేశాయి.

ఈ నెల బహుమతి పొందిన కథ — ఆర్. పార్థసారథి, జయపురం

బహుమతిగా ఈతనికి ఒక చక్కటి ఫౌంటెన్ కలము పంపబడుతున్నది.

అ బుధవారం రోజున తెల్లవారగట్ట మూడుగంటలకు కొంచెం ముందుగానే జిరాఫీ వెళ్లి మానవునివద్ద సిద్ధంగా ఉన్నది. అతడు జపంలోనించి లేచి, "వచ్చావా!" అని పలకరించాడు. "అయ్యా! ఖడ్గ మృగం నన్ను "నువు వెళుతూ ఉండు. వెనకాలే వస్తానన్నది" అంటూ చెప్పింది జిరాఫీ. అప్పుడు మానవుడు విసుక్కుని, "సరే, నీవు ఇలారా. సమయమైంది. నోరు తెరువు" అన్నాడు. అది నోరు తెరవగా మానవుడు ఒక మూలిక పడవేసి కమం డలువులోని మంత్రజలం పోశాడు. ఈ జలం గొంతుక దిగీదిగడంతోనే జిరాఫీకి దిగువ కాళ్లూ, పైన మెడా పొడవుగా ఎదిగిపోయినై.

జిరాఫీ మానవునికి కృతజ్ఞత తెలుపుతూ "అయ్యా! నా నేస్తం మాట?..." అనేటంతలో మానవుడు "మాట తప్పిన వాళ్లగతి ఇంతే," అంటూ మళ్లీ మరి ఒక వేరుముక్క తెచ్చి, జిరాఫీ నోట్లో వేస్తూ, "నీ నేస్తంకోసం అట్టేవుంచిన ఓషధికూడా నీకు వేస్తున్నాను. దీనివల్ల ఇప్పుడు నీలో కలిగిన మార్పు శాశ్వతంగా ఉండిపోతుంది వెళ్లు" అంటూ దానిని పంపివేశాడు.

జిరాఫీ కొత్తరూపంతో అడవుల్లోకి వెళ్లిపోయి, గడ్డి తినడం మానివేసి చెట్లపైన వుండే చిగురుటాకులు తుంపుకొని తిన జొచ్చింది. అది అలా తింటూవుండగా దాని నేస్తం ఖడ్గమృగం వచ్చి, చూచి ఆశ్చర్యపోయింది. అప్పుడు జిరాఫీ జరిగిన సంగతి అంతా చెప్పేసరికి, ఖడ్గమృగం అహంకారంతో, 'కాస్తవేళ దాటితే మాత్రం నాకోసం ఉండవద్దా? ఐనా, ఈ మానవుణ్ని నమ్మ పనిలేదు. ఉండు వాడినేమి చేస్తానో!' అని మూర్ఖతతో మానవుని చంపటానికి కసిపూని, విరోధం తెచ్చుకుంది. మానవుని స్నేహం చేసిన జిరాఫీ మాత్రం నేటివరకూ పొడుగుమెడతోనే ఉండిపోయింది.



## అమ్మ కావాలీ...ఇఇఇ

"మహేశ్వర్" (మద్రాసు)



అడుతూ పాడుతూ, అలిగేడు బాబూ
అలిగితే అక్కయ్య ఆదరించిందీ!
ఆదరించిన అక్క బుజ్జగించిందీ,
బుజ్జగింజిన కొలది దుఃఖమొచ్చిందీ,
కోపమొచ్చిన అక్క బుగ్గ గిల్లిందీ
గుక్క తిప్పక బాబు బొబ్బలెట్టేడూ!

ఇంతలో నాన్నొచ్చి ఏమిటన్నాడూ
అక్క గిల్లిన బుగ్గ చూడుమన్నాడూ!
అక్కనొక కేకతో కూకలేసేడూ
నాన్న బుజమెక్కేడు రత్నాలబాబూ,
బుడిబుడీ దుఃఖాలు మొదలుపెట్టేడూ
బుజ్జగించినకొద్దీ ఏడుపెచ్చిందీ!

చీకాకుతో నాన్న చిర్రుమన్నాడూ
బిర్రబిగిసిన బాబు కెవ్వుమన్నాడూ
ఇంతలో అమ్మొచ్చి ఆదరించిందీ
నవ్వుతూ నా బాబు ఏడ్పు మింగేడూ!

అమ్మ లాలింపులో అది యేమొ తీపి
ఆశ్చర్యపడుతూను అక్క నిల్చుంది!
తల్లి లాలింపులో ఇంపేమొగాని
తెల్లబోతూ నాన్న మెల్లగా జారె!

# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

అడ్డము:

1. బ్రహ్మ
3. చావడి
5. అధైర్యము
6. కుమార్తె
8. రహస్యము
11. యముడు
12. కొలను
14. క్రొత్త
15. ఏనుగు




నిలువు:

1. కుక్క
2. భూమి
3. రౌతు
4. తీగె
7. తాబేలు
9. ఒక పువ్వు
10. వినోదము
11. అడవి
13. లక్ష్యము

# మదరాసులో మన సర్కారు

## సర్కారు ఎక్కడవుంటే చందమామ అక్కడ వుంటున్నది!

చందమామ పాఠకులకు ఒక సంతోష వార్త!

కలకత్తా, బొంబాయి నగరాలలో దిగ్విజయ ప్రదర్శనాలు జరిపిన మన సర్కారు ఇటీవల మద్రాసుకూడా వచ్చారు. ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ మొదలైన ఖండాంతర ప్రజలనే ఆశ్చర్యపరచిన సర్కారు మదరాసు పౌరుల్ని ముగ్ధుల జేశారంటే ఆశ్చర్యం ఏముంది? ఎందరో ఇంద్రజాలికులను చూచివున్న మదరాసు పౌరులు, "అందరినీ మించినవారు సర్కారు" అన్నారు.

సర్కారు ప్రదర్శనాలలోని ప్రత్యేకతలు ఏమిటంటే—ప్రతి ట్రిక్కులోనూ ఒక క్రొత్తదనం, అవన్నీ అతిసహజంగా వుండటం, అన్నిటికన్న ముఖ్యమైనవిషయం చూచేవారికి బహు కష్టసాధ్యంగా కనుపించే ట్రిక్కు సైతం అతి సులభంగా, రెప్పపాటుకాలంలో చూడ ముచ్చటగా చేయగలగటం.

ముఖ్యంగా రెండుట్రిక్కులు అద్భుతంగా వున్నై. మొదటిది: గొప్ప గొప్ప డాక్టర్ల సమక్షంలో, ఒక్క నెత్తురు బొట్టు అయినా క్రిందపడకుండా మనిషినాలుకను కత్తిరించి తిరిగి అతికించటం. రెండవది: ప్రేక్షకులు ఏది వ్రాసినా తమ యక్స్-రే కళ్ళ శక్తితో ఇట్టే చెప్పుకోవటం, ఎవరు ఎలాంటి పిచ్చిగీతగీసినా రెప్పపాటుకాలంలో దాన్ని ఒక చక్కటి బొమ్మగామార్చివేయడమున్నూ.

ఇటువంటి అత్యద్భుత విద్యలు ప్రదర్శించి వుండటంవల్లనే మన సర్కారు "ప్రపంచ విఖ్యాత ఇంద్రజాలికులలో అగ్రగణ్యుడు" అని కీర్తింపబడుతున్నారు.

మనకందరకూ అమితానందం కలిగించే వార్త మరొకటి వున్నది. మదరాసులో వా రున్న ఈ వారంరోజులూ ఎక్కడవిన్నా సర్కారుపేరే! సర్కారుపేరు వినపడినచోటెల్లా 'చందమామ' పేరూ వినపడుతూ వచ్చింది. సర్కారు తమ ప్రదర్శనా లన్నిటిలోనూ, ఒక్కసారి అయినా మరువకుండా, తమకు ప్రియమైన 'చందమామ'ను ప్రేక్షకులకు పరిచయంచేస్తూవచ్చారు.

వారు ఒకనాడు ఎంతో అప్యాయతతో మా అఫీసుకుకూడా వచ్చారు. ఆ సందర్భంలో, "ఏదైనా క్రొత్తట్రిక్కు మా ఆఫీసువారికి చేసిచూపాలి" అనికోరాము. "తప్పకుండా చూపుతాను" అంటూ వారు ఒక త్రాడు తెమ్మన్నారు. తెచ్చియిచ్చాము. ఆ త్రాడును రెండు ముక్కలుగా కొయ్య మన్నారు. కోశాము. రెండుముక్కలూ ఒకరి గుప్పెటలో పెట్టి మూశారు. ఆ వెంటనే గుప్పెట తెరవ మన్నారు. ఏమి ఆశ్చర్యం! రెండుముక్కలూ అతుక్కుపోవటమేగాక కత్తిరించిన అనవాలుకూడా కనుపించలేదు. ఈట్రిక్కు చేస్తున్నప్పుడు మా ఆఫీసులో అందరమూ సర్కారు చుట్టూనే వున్నాము.

దీనిరహస్యం చెప్పమని కోరగా, "ఈ ట్రిక్కే కాదు. ఇలాంటివి మరెన్నో చిత్రమైన ట్రిక్కులు ముందుముందు నేర్పుతాను. 'చందమామ'కూ 'నాకూ' మధ్యని రహస్యమేమిటి? నేనూ చందమామ కుటుంబంలోవాడినేకాని పరాయివాడిని కానుగదా?" అన్నారు.

'చందమామ' అంటే సర్కారుకున్న ప్రేమా, అభిమానమూ అటువంటివి. ఇదే సందర్భంలో వారు మా పాఠకులకు యిచ్చిన 'సందేశం' ప్రక్కపేజీలో యథాతథంగా ముద్రిస్తున్నాము.

My dear reader-friends of 'Chandamama'

So long I wrote my tricks explaining its secrets through our own Chandamama. During my visit to Madras, I had the pleasure of personally seeing each and every department of this magazine. It is a gigantic organisation where they are scientifically working heart & soul for catering the best offerings to the readers of Chandamama.

I have been fully impressed by their sincere services. I have promised to give my best tricks to you all the readers of Chandamama. Because Chandamama is OUR OWN magazine

P. C. Sorcar
Magician

15th March '51

'ప్రియమైన నా 'చందమామ' పాఠకులకు :—

ఇంతకాలంగా నా ట్రిక్కులలోని రహస్యాలను మన 'చందమామ'ద్వారా వెల్లడిస్తూవచ్చాను. నా మదరాను పర్యటనలో 'చందమామ' ఆఫీసుకి వెళ్లి ప్రతిశాఖనూ పరిశీలించే భాగ్యం నాకు లభించింది. అది ఒక బ్రహ్మాండమైన సంస్థ. ఒక చక్కటి విధానంలో, అమూల్యమైన విషయాలను చదువరులకు అందజేయటానికి అక్కడి ప్రతిఒక్కరూ తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు.

హృదయమిచ్చిన వారిసేవ నాకు అమితానందం కలుగజేసింది. చందమామ 'మన పత్రిక'. 'చందమామ' ద్వారా ఇంకా ఎన్నో మంచి మంచి ట్రిక్కులను అందజేస్తానని మాట యిచ్చాను.

పి. సి. సర్కార్
మెజీషియన్

15 మార్చి '51



# రోకంటి పాటలు



వడ్లు దంచంగానె వచ్చె చుట్టమ్మ
పొమ్మన్న పోడాయె వరికూటివాపి
వరికూటివాపికి వంకాయ వండి
వంకాయ నే తిఁదు వార్ని పొమ్మందు.

అడదీ పుట్టింది అబల పుట్టింది
దక్షేల కోకలకు దైత పుట్టింది
మొగవాడు పుట్టాడు మొగ్గ పుట్టాడు
ధనము పెట్టెలకెల్ల దాత కలిగాడు.

కొడుకు పుట్టాడంటె కొఁడలెక్కుదరు
కోడలొచ్చిందంటె రచ్చకెక్కుదురు
పండగొచ్చిందంటె తిండికీ ప్రేమ
అల్లుడొచ్చాడంటె అత్తకూ ప్రేమ.

అందలము కోరింది కుందనపు కుచ్చు
అతి భోగి కోరాడు అత్తవారిల్లు
పల్లకీ కోరింది పచ్చన్ని కుచ్చు
పరదేశి కోరాడు పంచటరుగుల్లు.

ఆకలీవలె మంట లోకాన లేదు.
తల్లివలె బంధువులు ధరణిలో లేరు
వియ్యాలవారింట విందు భోంచేసి
చెంబెత్తి చెయిగడుగ శక్తి లేదమ్మ.

ఏవూరు చూచినా మావూరు గాదు
ఏవార్ని చూచినా మావాళ్లు గారు
ఏమిరా నాయన్న ననుజూడ రావు
ఏను నిను జూడొస్తె ఏమి తేగలను ?

గంపల్ల చక్కిలాల్ దుంప కురివేరు
మూటల్ల అరిసెలూ మొగ్గల్ల రవిక
ఎక్కేది అందలము ఏలేది భూమి
ఎడలేదు చెల్లెలా నినుజూడ రాను !

సవతి వచ్చిందంటె సంతోషపడితి
నా సవతి గాదమ్మ, నాగుల్లచవితి
చూడవే సుబ్బమ్మ కోడలొచ్చింది
అందాలు చిందేటి అతివ చక్కనిది.

ఆడబిడ్డ పేరెట్టి యేమనీ పిలుతు ?
అప్పక్క, బొప్పక్క రావె తిప్పక్క !
ఇఁ యేమి వింతమ్మ యీవూరిలోన ?
అత్తెల్లి కోడలికి యెత్తె చేతుల్లు !

[సేకరణ : అడుసుమల్లి సరస్వతీదేవి, ముదినేపల్లి]



## "ఎందుకో తెలుసా?"

"జిరాఫీ మెడ పొడుగ్గా ఉంటుంది ఎందుకో తెలుసా?" అన్నదానినిగురించి అర్. పార్థసారథి, జయపురం పంపిన కథ బహుమతిపొందింది. యితనికి ఒక చక్కని ఫౌంటెన్‌కలం పంపుతున్నాం.

వచ్చే నెల (మే '51) కు
"కప్పలు 'బెక బెక' లాడుతై"
ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీరు తెలుసుకుని ఒక చక్కటి కథ వ్రాసి పంపండి. రెండు పేజీలకు మించకుండా వుండాలి. కథలు ఏప్రిల్ 15-వ తేదీలోగా మాకు చేరేట్టు ఈ క్రింది అడ్రసుకు పంపండి.

"కథల తాతయ్య"
**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు 1686, మదరాసు-1





కె. భాగ్యలక్ష్మి, బెంగుళూరు


టి. సౌభాగ్య, మైసూరు




ఈ బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (మే) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI.
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras.

CHANDAMAMA (TELUGU) APRIL 1951 REGD. No. M. 4854




'ఎవరు లోపల ?...పంతులు కాదుకద !...'